# కమ్మని పరిమళముగల శ్రేష్ఠమైన టాల్క్

పాండ్స్ డ్రీంఫ్లవర్ టాల్కుం పౌడర్ వాడి రోజంతా నిలిచే చల్లదనం, తాజా హాయి పొందండి




స్నానం చేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కుం పౌడరు ఒంటినిండా జల్లుకొని చాలాసేపు నిలిచే తాజాతనాన్నీ, సువాసననూ పొందండి...అతి నాజూకైన సువాసనతో కూడిన యీ టాల్కుం పౌడరు క్షణంలో చెమటను పీల్చి, ఏ వాతావరణంలోనైనా, రోజంతా ఆహ్లాదకరమైన చల్లదనాన్నీ, తాజాతనాన్నీ చేకూరుస్తుంది! ఇంటిల్లపాదికీ యీ పౌడరు ఎంతో ఆదర్శమైనది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

JWT-P-4598

సమర్పితం
క్రొత్త
# గోద్రెజ్
# సాండల్




ఐరోపా, అమెరికాలకు ఎగుమతి నిమిత్తం ప్రత్యేకంగా సృష్టితమై బయల్పరచబడ్డ సౌఖ్యానందకరమైన సబ్బు, ఇపుడు ఎన్నికగా భారతదేశంలో అమ్మకమగుచున్నది!

గోద్రెజ్ సాండల్...శుద్ధమైన మైసూర్ చందన మానె నుండి నైపుణ్యంగా మిశ్రమం చేయబడిన ఉల్లాసకరమైన ప్రశస్తమగు నిలవుండే పరిమళం గలది...ఇట్టి వాటిలో చాలా కాలం నిలవుండే చాలా పెద్ద సబ్బు నేడే దీనిని వాడి చూడండి. దాని హాయిగొలిపే పరిమళం మీ కెంతో ప్రీతిమైనది!

**గోద్రెజ్ సాండల్**
...అందరూ ఆనందించగల సౌఖ్యదాయకం



Godrej
గోద్రెజ్
సబ్బులలో
ఉత్తమ
నామము



# నేడే చూడండి!

రాజ్యం వారి



# శకుంతల



నిర్మాతలు

శ్రీధరరావు...రాజ్యం

దర్శకత్వం

కె. కామేశ్వరరావు B.A.

రాజశ్రీ రిలీజ్



# ఉత్తరాలు

## కథలు

'మాయ' కథ ప్రస్తుత ప్రపంచాను భవనమునకు పరిపోయినది. 'మాయ'వంటి స్త్రీలు లోకములో యిపుడు ఎక్కువవు తున్నారు. వారి వలలలో పడిన పురుషుల చివరకు కథలోని కథానాయకునివలె చింతించవలసినదే.

పి. నారాయణ, (వంగిమళ్లవారిపల్లె)

* * *

ఉగాది సంచిక బాగున్నది. 'హాంటెడ్ హౌదర్స్' హాస్య నాటిక చదివినతర్వాత నవ్వకుండ ఉండలేకపోయాను. 'మలుపు తిరిగింది' కథ అక్షరాల వాస్తవానికి దగ్గరగా నున్నది. సినిమా బాలట్ విజేతలకు ఉగాది శుభకాంక్షలతో. ...

ఎస్. నరసింహారావు, (తిరుమల)

* * *

శ్రీ కొలను వెంకట దుర్గాప్రసాద్‌గారు రచించిన 'శకునం' కథలో ప్రతి ఒకటో తారీఖు ఉదయం మామ్మగారు అద్దె వసూలు చేస్తుందని రాశారు. కాని ఒకటో తారీఖు సాయంత్రంగాని ఎవరికీ జీతాలు రావు. కనుక రెండో తారీకు ఉదయం అని రాసినట్లయితే బాగుండేది. ఈ చిన్నతప్పు తప్ప కథంతా బాగానే ఉంది.

రాము ఆమదన్, (హైదరాబాద్)

* * *

'హంస' కథ నన్ను చాలా ఆకర్షించింది. ఈ కథలో స్త్రీయొక్క పాత్రను అతిసహజంగా చిత్రీకరించి, చివరకు ఆమె యొక్క పాత్రను, ఆమెకు తెలియపరచి, ఆమెలో పశ్చాత్తాపమును రేకెత్తించినను, క్షమార్హురాలు కాలేకపోయినటులు చిత్రించిన యామినిగారికి నా హృదయ పూర్వక అభివందనలు

వి. ఎల్. ఎన్. రావ్, (బరంపురం)

## సినిమా బాలట్

ఆంధ్రప్రదేశ్ ఫిలింఫాన్స్‌వారి 'ఫిలిం బాలట్ ఫలితాలు' మీరు ప్రకటించిన ఫలితాలు ఒకేవిధంగా, ఏమాత్రం మార్పులేకుండా వెలువడినాయి. క్రితం సంవత్సరముకూడ, ఇదేవిధంగా రెండు సంస్థల బాలట్‌ఫలితాలు ఒకేరకంగా వున్నవి. దీనిని బట్టిచూస్తే? ఏమైనాపత్రిక 'ఫలితాలు' సంతృప్తికరంగా లేవనిచెప్పడానికి విచారిస్తున్నాను.

వై. కె మూర్తి, (విజయవాడ)

* * *

సర్వాంగ సుందరంగా అలంకరించుకొని తెలుగువారి మనస్సులను వారి గృహాలను అలంకరించవచ్చిన మా అభిమానపత్రిక అయిన ఆంధ్ర సచిత్ర వారపత్రికను ఎంతో సంతోషంతో అందుకొన్నాము. కానీమమ్మల్ని సినీ బాలెట్ ఫలితాలు నిలువునా క్రుంగదీసాయి. ప్రతిసారీ మమ్మల్ని ఉత్సాహపరుస్తూ పాఠకులు ఆశించిన విధంగా వెలువడే ఈ ఫలితాలు ఈమారు వారి అభిప్రాయానికి విరుద్ధంగా వెలువడ్డాయనటంలో సందేహంలేదు. ఇలా ఇక ముందు జరగదని ఆశిస్తాను.

పాటిమళ్ల శ్యామసుందర్, (సత్తెనపల్లి)

## సినిమా

18—3—66సంచికలో కర్నూలునుంచి టి.వి. యస్.రావు గారు భానుమతీరామకృష్ణ గారినిగురించి తప్పు అభిప్రాయపడ్డారనుకుంటాను. శ్రీమతి భానుమతిగారు "నేను సినీవరిశ్రమలో చేసిన కృషికి రాష్ట్రపతి ప్రకటించిన పద్మశ్రీ బిరుదుకన్న అకాడమీ వారు నా గ్రంధానికిచ్చిన బహుమతిమిన్నగా భావిస్తున్నాను" అని అనడంలోతప్పేమీలేదనుకుంటాను. ఎందుకంటే అర్హతకొద్దీ వచ్చింది పద్మశ్రీ బిరుదు. అదృష్టంకొద్దీ వచ్చింది అకాడమీ బహుమతి. అందుచేత అలాఅనడంలో ఆమెఉద్దేశ్యమేమంటే నా అర్హతకు పద్మశ్రీ బిరుదు వచ్చింది, కాని అనుకోకుండా అకాడమీ బహుమతివచ్చింది. కావున ఇదేమిన్న అని ఆమెఉద్దేశ్యం అని ఎందుకనుకో గూడదు? ఆమె అలా అనడంలో గర్వంగాని తప్పుగాని లేదు. అర్హతకన్నా అదృష్టం మిన్నగా భావించడం సహజం.

నేను ఇలా వ్రాయటం టి. వి. యస్. రావు గార్ని విమర్శించటంగాదని తెలుసుకోగోర్తాను.

వి. భారతి, (హైదరాబాదు) ●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 8—4—66

పరాభవనామ సం॥ చైత్రమాసం బహుళ॥ తదియ

సంపుటము : 58 సంచిక : 32

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా |
|---|---|
| | రూ. పై. |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |


వచ్చేవారం :

*

మహానగరం
ముచ్చట్లు

*

ప్రత్యేకమైన
బొమ్మలతో :

## మనలో మాట

ఎండాకాలం వస్తోంది—లేక వచ్చేసిందా! చెమట ఎందుకు పడుతుం(డో్తుం)ది? జవాబు కావాలనుకుంటే 9వ పేజీ చూడండి...

* * *

ప్రచురణకోసం ఉత్తరాలు రాసేవారందరూ సదుద్దేశాలతోనే రాస్తున్నామని తెలిపేందుకు తమ పేరుతోబాటు పూర్తి చిరునామా కూడా ఇవ్వాలి...

* * *

చాలాకాలం తర్వాత చదువుల్రావుగారు ఈ సంచికలో ఒకసారి కవి పిస్తారు...

* * *

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారిని అభినందిస్తూ కొందరు పత్రికా రచయితలు ఇటీవలే చేసిన ఒక 'టీపార్టీ'లో ఆయన ఉపన్యసించారు. ఆ ఉపన్యాసం సారాంశమే ఈ సంచిక 50వ పేజీలో ప్రారంభం అవుతుంది.

* * *

'ఆంధ్రసచిత్రవారపత్రిక' నడిపిన 'బాలట్' ఫలితాలు కొందరికి నచ్చలేదు! అటువంటి వారి ఉత్తరాలు కొన్ని ప్రచురిస్తూ ఉన్నాము. అలాగే ప్రభుత్వం ఇచ్చే 'ఎవార్డు'ల విషయములు కొందరికి కొన్ని అభ్యంతరాలు ఉండక మానవు. ఒక 'అభ్యంతరం' 55 పుటలో వేశాము...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'శ్రీకృష్ణతులాభారం'లో పద్మిని,



చూడండి సార్!
పాకిస్తాన్
ఏం పని చేస్తోందో!
తాష్కెంట్
ఒప్పందం




ఉర్దూకు
ఆంధ్రాలో
రక్ష
ఉర్దూ




నీళ్ళు
నందాపై ఆరోపణల
విషయంలో
ఆర్థికమంత్రి
నందాకు
సాయం
చేస్తున్నారు
ఆర్థికమంత్రి
సర్టిఫికేటు




తిమింగలం కోసం
వెళ్తున్నా
రైల్వేలలో
అవినీతి నిర్మూలిస్తానని
శ్రీ పాటిల్ హామీ.

న్యూఢిల్లీ లేఖ

# 1947లో ద్విజాతిసిద్ధాంతం! 1966లో త్రిజాతిసిద్ధాంతం!!

'ఉగాది' శుభసమయాన నేను 'ఢిల్లీలేఖ' వ్రాస్తున్నాను పాఠకులందరికీ నా శుభాకాంక్షలు. ఈరోజు మనందరికీ మళ్లీ మళ్లీ రావాలని కూడా ఆశిస్తున్నాను.

* * *

ఇండియాలో 'రాష్ట్రాల పునర్విభజన' మూడవసారి జరిగే విషయమై గతవారం లోనే ప్రకటన ఒకటి వెలువడింది. పార్లమెంటరీ కమిటీ గతవారంలో సమర్పించిన నివేదిక ఒకదానిని అనుసరించి ప్రభుత్వం ఈ ప్రకటన చేసింది. పంజాబ్‌రాష్ట్రాన్ని మూడు రకాలుగా విభజిస్తున్నారు. హిందీ మాట్లాడే పంజాబ్ ఒకటి, పంజాబీమాట్లాడే పంజాబ్ ఒకటిగాక—హిమాచల్ ప్రదేష్‌లో కలిసే పర్వతప్రాంతపుజిల్లాలు—అన్నీ కలిపితే మూడు భాగాలయ్యాయి. ఈ జిల్లాలను కలిపే విషయంలోమాత్రం ప్రభుత్వంవారి ప్రకటన యింకా వెలువడలేదు.

## భాషారాష్ట్ర పిత

దీనికి సంబంధించిన చరిత్ర కొంత చెప్పుకొందాం భాషారాష్ట్రాల ప్రసక్తి మొదట్లో తీసుక వచ్చింది శ్రీ మహాత్మాగాంధి. అంత వరకు 'ఇండియా'లో యీ ఆలోచనే ఉండేది కాదు కాంగ్రెస్ అవసరాలకోసం శ్రీ గాంధి ఇండియాను భాషలవారీగా విభజించారు. బొంబాయిలాంటి ప్రదేశాల్లోమాత్రం రెండేసి భాషలకు అవకాశాన్నిచ్చి చూశారు. కాని, ఆరోజుల్లో మహారాష్ట్రులు, గుజరాతీలు యిది నచ్చక ఎడముఖం, పెడముఖం అయిపోయారు.

కాని మహాత్మాగాంధి, పంజాబీ కాంగ్రెస్ ప్రదేష్ కమిటి అంటూ ఏదీ నెలకొలుపలేదు. పంజాబ్‌లో హిందీ, పంజాబీ—రెండు భాషలు మాట్లాడే వారికోసం ఒకే కాంగ్రెస్ కమిటీ ఉండేది. శ్రీ గాంధి సజీవులుగా వుండే రోజుల్లో 'సిక్కిస్తాన్' నొకదానిని ఏర్పాటు చేయాలని విశ్వ ప్రయత్నంచేశారు. అదే యీనాడు 'పంజాబీసుబా' అయి కూర్చొంది.

ఏవేవో కారణాలతో, మహాత్ముడు మూడు రంగుల జెండాను సృష్టించాడు. అందులో ఎరుపు హిందువులకు, ఆకుపచ్చ మహమ్మదీయులకు, తతిమ్మావారికీ తెలుపురంగు వున్నాయట. ఇది చూచిన సిక్కులు ఆ జెండాను తగులపెట్టడం మొదలెట్టారు ఇది చూచిన మహాత్మాజీ, యీ సంఘటనకు లొంగిపోయి, వెంటనే ఎరుపును 'కాషాయ రంగు'గా మార్చారు.

## జాతీయవాదులా?

అంతకుపూర్వం బ్రిటిష్‌వారి ఆధిపత్యం జోరుగావుండే రోజుల్లో, పాలక మండలిలో ఒక సిక్కుకూడా వుండేవారుకాదు. క్రైస్త



పారిస్‌లో ఫ్రెంచి అధ్యక్షుడు జనరల్ డీగాల్‌తో ముచ్చటిస్తున్న శ్రీమతి ఇందిర...!

వుల సంఖ్యకన్న వీరిసంఖ్య తక్కువ కావటమే యిందుకు కారణం. కాని, మహాత్మాజీ తవ కాంగ్రెస్ కార్యవర్గములో ఒక సిక్కుకు తప్పక అవకాశం యిచ్చేవారు. సిక్కులు మొదట్నించి కాంగ్రెస్‌కు వ్యతిరేకులే. కొంత కాలానికి, మహమ్మదీయుల్లాగా వీరు కూడా రెండు వర్గాలుగా చీలిపోయారు. మరో వ్వాదు లోకవర్గం, జాతీయవాదులు మరొక వర్గం. అన్నిజాతులకు ప్రాతినిధ్యం ఉండా లని, బ్రిటిష్‌వారికి యిది బాగా నచ్చచెప్పా లని, మహాత్మాజీ ఆ రోజుల్లో ఎంతగానో ఉబలాట పడేవారు. జాతీయవాదులయిన మహమ్మదీయులు ఇండియా విభజనను నిలుప లేకపోయారు. అలాగే సిక్కులు కొందరు జాతీయవాదులే అయినా, పంజాబ్ విభజ నను ఆపలేరు.

ఆరోజుల్లో మరో విచిత్రం జరిగింది! ఇది చాలా బాధాకరమే అయినా చెప్పు కొందాం. ఇండియా—పాకిస్తాన్ విభజన అయిన మరుక్షణంలో మూడు రేడియో ప్రసారా లొచ్చాయి. శ్రీయుతులు జవహర్ లాల్‌నెహ్రూ, ముస్లింలీగ్ తరఫున మహ మ్మదాలీ జిన్నా, సిక్కుల తరఫున సర్దార్ బల్‌దేవ్‌సింగ్‌లు ప్రసంగాలు చేశారు. అంతకు పూర్వమే సర్దార్ బల్‌దేవ్‌సింగ్ శ్రీ నెహ్రూతో లండన్ వెళ్లిన ఫలితంగానే అక్కడి పెద్దలు, లార్డ్ వేవెల్‌ను తిరిగి పిలిపించుకోవటం, ఇండియాను విభజించటం జరిగాయట.

## త్రిజాతి వాదం

దీన్నే విపులీకరించాలంటే 1947లోనే

# న్యూఢిల్లీ లేఖ

మహాత్మాగాంధీతోబాటు, నెహ్రూజీ కూడా ఇండియాలో మూడు దేశాలున్నాయని, అవి హిందువులు, మహమ్మదీయులు,సిక్కులు అనే మూడు రకాల తత్వాల వ్యక్తులతో ఏర్పడ్డాయని అంగీకరించారన్నమాట. తారా సింగ్ తమకోసం—అంటే సిక్కులకోసం—వేరే ప్రాంతం 'సిక్కిస్తాన్' ఉండాలని ఆందో ళన చేశారుకూడా. జిన్నా దృష్టిలో ఇండి యాలో రెండు దేశాలుంటే, మాస్టర్ తారాసింగ్ ఆశయంలో ఇండియాలో మూడు దేశాలున్నాయి. ఈ దశలో సంత్ ఫతే సింగ్ రంగంలోకి అడుగుపెట్టారు. పంజాబీ ప్రాంతీయ భాషగావుండే రాష్ట్రం ఏర్పరచా లని సంత్ ఫతేసింగ్ కోరిక. దేశంలో యిన్ని భాషలవారు, ఎవరి భాషవారు వారికిరాష్ట్రా లను ఏర్పరచుకొంటే, "ఇక మాకేనా అక్కరలేనిది?"—అని యీయన వాదన. ఒక రకంగాచూస్తే యీయన చెప్పిన వాదంలో కొంత అర్థం వుందనిపిస్తుంది. బెంగాలీ మాట్లాడేవారి కొక రాష్ట్రం. గుజ రాతీ మాట్లాడేవారి కొక రాష్ట్రం—ఎవరి రాష్ట్రాలు వారి కుండగా, యిక 'పంజాబ్'కి ఒక రాష్ట్రం ఎందుకు ఉండకూడదు?.... చూడటానికి, వినటానికి యీ వాదన బావు న్నట్టే అనిపిస్తుంది. కాని, ఇది చర్చకు వస్తే నిలువదు. అస్సాం వున్నది—అక్కడే అస్సామీ మాట్లాడే హిందువులు, మహమ్మ దీయులు, ముసల్మానులు ఉన్నారు. అలానే గుజరాత్‌వుంది—అక్కడ గుజరాతీమాట్లాడే హిందువులు, పార్శీలు, ముసల్మానులు ఉన్నారు. కాని,పంజాబీ మాట్లాడుతూ,'సిక్కు' కాని 'వ్యక్తి' ఒక్కరూలేరు. అంటే, పంజాబీసుబాకోసం వెలుగులోకి వచ్చిన యీ ఆందోళనకు ప్రాతిపదిక మత తత్వం అన్న మాట!

## కాంగ్రెస్ వాదం

శ్రీ నందాగారు అంగీకరించినా, అంగీ కరించకపోయినా—ఒక్కటిమాత్రం నిజం!... ఒకప్పుడు మాస్టర్ తారాసింగ్ ప్రతిపాదించిన "మూడు జాతుల ఇండియా" అనే అభిప్రా యాన్ని కాంగ్రెస్‌ప్రభుత్వం ఆమోదించిందన్న మాట. 1966లో పంజాబ్ విభజన కావటం కేవలం భాషా ప్రాతిపదికమీద అనుకోవటం పొరబాటు. దీనికి మత తత్వం మూలం. ఇందుకు, నిజంగా విచారించవలసివున్న న్నది. తాము వూహించుకొన్నట్టే సిక్కు లకు ఒక రాష్ట్రం లభించబోతున్నది. కాంగ్రెస్ తొందరపాటువలన, దేశం యిలా ముక్కలపాలవుతున్నది. దీన్ని నిందించటానికి బ్రిటిష్ వారెవరూ లే రీనాడు!

'పంజాబీసుబా' సమస్య, ప్రతాప్‌సింగ్ కైరాన్ మరణంతోనే ఆరంభం అయింది. శ్రీ కైరాన్ స్థానానికి ఒకరిని నిర్ణయించ వలసిందని స్వరణ్ సింగ్‌ను పంపారు. శ్రీ స్వరణ్ సింగ్ అక్కడే తప్పటడుగు వేశారు. తాను ఆస్థానానికి వెళ్లటమో, లేక పేరు ప్రఖ్యాతులున్న మరో 'సిక్కు'నుసూచించ టానికో బదులు, వూరు పేరులేని శ్రీ రామ్ కిషన్‌ను ఆ స్థానానికి తీసుకొచ్చారు. 'సిక్కు' ఒకరు ముఖ్యమంత్రి అయిఉంటే యీనాడు మనకీ సమస్య లుండేవికావు.

మరో సాంఘిక సమస్యవుంది. మహమ్మ దీయుల్లాగాకాకుండా, హిందువులు,సిక్కులు, కలిసి భోంచేస్తారు. ఈ జాతులమధ్య వివా హాలు జరుగుతూవుంటాయి. అందరూ పంజాబీ మాట్లాడుతారు. అంటే యీ భేదాభిప్రాయం అంతా భాషను గురించి కాదు. వ్రాత లిపిను గురించి మాత్రమే!

'పంజాబీసుబా' ఆందోళన వెనుక మరో భయం కూడా లేకపోలేదు. సిక్కులలో యువ తరం అంతా, గడ్డాలుతీసివేస్తున్నారు. ఉద్యో గాలలో 'సిక్కు'లకు రిజర్వేషన్లు తగ్గాయి. పాపం, యీ రెండిటికోసమేనేమో, పంజాబీ సుబా!

—శ్రీకృష్ణ






రోహిణీ కార్తె రోజులు. ఎండలో నడిచి వచ్చి, మర్రిచెట్టునీడను ఎవరో పుణ్యాత్ముడు పెట్టిన చలివేంద్రల దగ్గర కుండలో నీళ్ళు తాగి, హమ్మయ్య అనుకున్నాను ఒక కుక్క ఆమర్రి నీడలోపడుక్కుని, నోరు తెరచి, నాలుక బయటకు వడేసి వగరుస్తోంది. ఏడెనిమిది ఏళ్ల పిల్లాడొకడు వాళ్లతాతను ప్రశ్నలతో విసిగిస్తున్నాడు

"ఆకుక్కఅల్లా ఎందుకు అంటోంది? తాతయ్యా!"

"బాగా అలిసి పోయినట్లుంది. పాపం ఆయాస పడుతోంది"—అవి తాత జవాబు.

మరికొంచెం సేపున్నాక పిల్లాడుమళ్లీ అడిగేడు.

"కుండలో నీళ్లు ఇంత చల్లగా ఎందుకుంటాయి?"

తాత జవాబు చెప్పలేదు పిల్లవాడి దృష్టి మరో వైపుకిపోయింది. చెమటకి తడిసిపోయిన చొక్కాకేసి చూచుకున్నాడు.

"చెమట ఎందుకు పోస్తుంది ? తాతయ్యా!"

"ఎందుకేమిటా చొప్పదంటు ప్రశ్నలూను నువ్వూనూ, వేసవికాలం అయినప్పుడు చెమటలుపొయ్యవూ?"

ఆప్రశ్నలూ, ఆజవాబులూ వినగా నాకు నవ్వొచ్చింది. అపిల్లవాడి జిజ్ఞాసకు సంతోషమైంది. ఆతాత తన శక్త్యనుసారం జవాబులు చెప్తూనే ఉన్నాడు. ఆ చెప్పిన జవాబులన్నీ శాస్త్రరీత్యా సరియైనవేనా? చూద్దాం.

నీరు — ఆమాటకువస్తే ద్రవాలన్నీ ఎల్లప్పుడూ ఆవిరి అయిపోతూ ఉంటాయి. ఉష్ణోగ్రత పెరిగినకొద్దీ ఆవిరి అయ్యే వేగం పెరుగుతుంది. నీరు ఆవిరిగామారడానికి కొంతశక్తి అవసరం. ఉదాహరణకి ఒక లిట్టరు నీరు ఆవిరి అవడానికి సుమారు 5 లక్షల కేలరీల వేడి అవసరం నీరు ఆవిరి అవడానికి అవసరమైన ఈవేడిని పీల్చుకుని ఆవిరి బయటికి జారుకుంటూ ఉంటే, మిగిలిన నీరు చల్లబడుతుంది కనుక ద్రవం ఏదైనాసరే ఆవిరి అవుతున్నప్పుడు చల్లబడుతుంది. ఎంతవేగంగా ఆవిరి అయిపోతే అంత అధికంగా చల్లబడుతుంది. ఇత్తడి బిందెలో మూతవేసి ఉంచిననీరు ఆవిరి అయి పైకి పోయే అవకాశం లేదు. కనుక బయట ఎంత ఉష్ణోగ్రత ఉందో బిందెలోని నీరుకూడా అంతే ఉష్ణోగ్రత ఉంటుంది. మట్టితో చేసి, కాల్చిన కుండకి కంటికి కనబడని సూక్ష్మమైన రంధ్రాలుంటాయి ఆరంధ్రాలలో నుంచి నీరు బయటికి చెమర్చి,ఆవిరిఅయిపోతుంది. కనుక, కుండలో నీళ్ళు చల్లగా ఉండడానికి కారణం, కుండకి చెమర్చే గుణం ఉండడమే. జాడీలు మట్టితో చేసినప్పటికీ ఒక ప్రత్యేక పద్ధతిలో మెరుగు పెట్టి, అవిచెమర్చకుండా చేస్తారు. కనుక జాడీలో నీళ్లు చల్లగా ఉండవు.

ఇంజక్షను ఇచ్చేముందు డాక్టరు జబ్బుకి స్పిరిటు రాస్తాడు. అదితగలగానే చాలా చల్లగా ఉంటుంది. దీనికి కారణం స్పిరిటుకి అతివేగంగా (నీళ్లకన్నా వేగంగా) ఆవిరి అయిపోయే గుణం ఉండడమే. ఆముదం చాలా నెమ్మదిగా ఆవిరి అవుతుంది., కనుక ఒంటికి ఆముదం తగిలితే చల్లగా ఏమీ ఉండదు.

ఒంటికి చెమటపట్టడానికీ, చెమర్చే కుండలో నీళ్లు చల్లగా ఉండడానికీ చాలా దగ్గర సంబంధం ఉంది.

ఆరోగ్యంగా ఉన్నమనిషి శరీరపు ఉష్ణోగ్రత ఎల్లప్పుడూ 98.4 డిగ్రీలు (ఫారిన్‌హీట్) దగ్గర స్థిరంగా ఉంటుందని మనకి తెలుసు. బయట ఎంతచలిగాఉన్నా, లేక ఎంతవేడిగాఉన్నా శరీరోష్ణోగ్రతమాత్రం మారదు. నిజానికి ఇది ప్రకృతి కనిపెట్టి నిర్మించిన అత్యద్భుతమైన సాధనాలలో ఒకటి. అయితే ఇది ఎలా సాధ్యం అవుతోంది?

ఒకవిధంగా మనశరీరం కుంపటి లాంటిది. మనం తినే ఆహారం శరీరంలోపల "మండుతుంది". పనిపాటలు చేసుకోడానికి, గుండెకొట్టుకోడానికీ, ఊపిరిపీల్చుకోడానికీ, అసలు బ్రతికి ఉండడానికీ అవసరమైన శక్తి ఆహారం మండడం ద్వారా లభ్యం అవుతోంది. అందులో కొంత భాగం ఉష్ణశక్తిగా మారి చర్మంలో నుంచి బయటికి జారిపోతూ ఉంటుంది బయటికి పోయే ఈవేడిని చలికాలంలో తగ్గించాలి. లేకపోతే శరీరం త్వరగా చల్లబడిపోయే ప్రమాదం ఉంది. బయట వేడి అధికంగా ఉన్నప్పుడు శరీరంలో నుంచి సాధ్యమైనంత అధికంగా ఉష్ణశక్తిని బయటికి పంపించెయ్యాలి. ఈ విధంగా శరీరంలోనుంచి బయటికి జారిపోయే ఉష్ణశక్తిని అదుపులోఉంచి, శరీరోష్ణోగ్రత సర్వకాల సర్వావస్థలలోనూ స్థిరంగా ఉండేట్లు చేసేసాధనాలన్నీ చర్మంలో ఉన్నాయి. చర్మంలోనూ, చర్మానికి కిందనూ రక్తనాళాలు అతిదట్టంగా ఉన్నాయి. బయట చలిగా ఉన్నప్పుడు

ఈ రక్తనాళాలు ముడుచుకుంటాయి. చర్మం బిరుసు ఎక్కుతుంది. అప్పుడు శరీరం లోపల ప్రవహించే వెచ్చని రక్తం పై పై రక్తనాళాలలోకి స్వల్పంగా ప్రవహిస్తుంది. ఈవిధంగా లోపలి ఉష్ణశక్తి బయటికి పోకుండా తగు చర్యతీసుకోబడుతుంది.

చర్మం ఎంతగా ముడుచుకున్నా శరీరం లోనుంచి కొంత శక్తి వేడిమి రూపంలో బయటికి పోకతప్పదు. నష్టమైపోయే శక్తిని భర్తీ చెయ్యడానికి ఆహారం ఎక్కువగా తీసుకోవాలి. అందుచేతనే శీతాకాలంలో ఆకలి ఎక్కువ వేస్తుంది.

ఎందుకో ఏదో ధర్మసూక్ష్మముంది. శరీరంలోనుంచి బయటికి జారిపోయే వేడిమి, బయటి చల్లగాలికి తగులుతున్న (ఎక్స్‌పోజ్ అయిఉన్న) శరీరపు ఉపరితల వైశాల్యం మీద ఆధారపడి ఉంటుంది. ఈ ఉపరితలాన్ని తగ్గించగలిగితే బయటికి పోయే వేడిమి తగ్గుతుంది. అందుకనే బాగా చలిగా ఉన్నప్పుడు ముడిచిపెట్టుకుని పడుక్కుంటారు.

చలి ఎక్కువగా ఉన్నప్పుడు కదులుతూ పనిచేస్తూ ఉంటే వేడిమి అధికంగా ఉత్పత్తి అయి చలి తగ్గుతుంది. ఏమీ కదలకుండా ఉండిపోతే శరీరం చల్లబడిపోయే ప్రమాదం ఉంది. అప్పుడు మన ప్రమేయంలేకుండానే శరీరంలో కొన్ని కండరాలు వాటంతటఅవే కదులుతాయి! దానినే మనం 'వణకడం' అంటున్నాం. ఈ కదలికవల్ల పుట్టే కాస్తపాటి వేడిశరీరం కొంకరించుకు పోకుండా కాపాడుతుంది.

## చెమట ఎందుకు...



శరీరంలోపల వేడిమి మరీ అధికంగా ఉత్పత్తిఅవుతూఉంటే చర్మం కింది రక్తనాళాలు తెరుచుకుంటాయి. వేడెక్కిన లోపలి రక్తం బయటికి స్వేచ్ఛగా ప్రవహిస్తుంది. లోపలి వేడిమి ఈవిధంగా బయటికి వచ్చి చల్లబడుతుంది.

బయటి ఉష్ణోగ్రత శరీరోష్ణోగ్రతను మించిపోతే శరీరంలోనుంచి బయటికిపోయే వేడిమికన్న, బయటనుంచి శరీరంలోకి ప్రవేశించే వేడిమి ఎక్కువ అయిపోతుంది. అప్పుడు చర్మంకింది రక్తనాళాలు తెరుచుకున్నంత మాత్రాన సరిపోదు. ఈ పరిస్థితులలో శరీరాన్ని చల్లబరిచే పద్ధతి ఒకే ఒకటిఉంది. అదే నీరు ఆవిరి అవడంద్వారా చల్లబడే పద్ధతి. మన శరీరంలో నూటికి 65 వంతులు నీరే. ఈ నీరు చెమట రూపంలో చర్మంలోనుంచి బయటికివచ్చి, ఆవిరి అయిపోతుంది. ఇట్లా చెమట ఇగిరి పోవడంవల్ల శరీరం చల్లబడుతుంది. మన శరీరంలోఉన్న స్వేదగ్రంధులు బహుశక్తివంతమైనవి. గంటకి లీటరుకి పైగా నీటిని చెమట రూపంలో బయటికి పంపగలవు! ఇంతింత నీరు బయటికిపోతోంది. కనుక, శరీరంలో ఆ నీటిని భర్తీ చెయ్యడానికి వేసవిలో మంచినీళ్లు చాలా తాగుతాం.

వాతావరణం పొడిగావుంటే చెమట గబగబా ఇగిరిపోయి, శరీరం త్వరగా చల్లబడుతుంది. బయటి గాలి తేమగా ఉన్నట్లైతే చెమట త్వరగా ఆవిరి అయిపోదు. బట్టలు తడి ముద్దలైపోతాయి. శరీరం త్వరగా చల్లబడదు. ఇది మరీ దుర్భరం.

మనుష్యులకుమల్లే కుక్కలకు స్వేద గ్రంధులు చర్మంకిందలేవు. నాలుకమీద ఉన్నాయి! కనుక వేడి ఎక్కువగా ఉన్నప్పుడు శరీరాన్ని చల్లబరుచుకునే యత్నంలో అది నాలుకను బయటికి వేలాడేసి, చెమటను కార్చేస్తుంది. అది ఆయాసపడడం కాదు.

చలివేస్తూవుంటే బట్టలు చుట్టబెట్టుకుని శరీరాన్ని వెచ్చగా ఉంచుకోవడం కష్టం ఏమీకాదు. అదే ఎండలు మండిపోతూఉంటే చెమటలుకారుస్తూ కూర్చోవడం తప్ప చేయగలిగిందేమీలేదు. అవునుమరి, రిఫ్రిజిరేటరు తయారు చేయడంకన్న కుంపటి చేయడం సులభం కదూ!




వాడి చిల్లిజేబు చిట్టితల్లి!

# చెల్లాయికి ప్రేమతో... 3

**'పి. ఎస్.'**

చెల్లీ,

నువ్వు వ్రాసిన ఉత్తరం అందింది. నేను చెప్పాను కనుక తోటకూర తింటానన్నారా మరిదిగారు? వెరీగుడ్. పాపాయి కులాసాగా వుందా? బాగా ఆటలు నేర్చిందంటావా? అవునుమరి! పిల్లలు ఎప్పుడూ ఉత్సాహంగా హుషారుగా ఆడుతూవుండాలి. అప్పుడే వాళ్ళు ఆరోగ్యంగా ఉల్లాసంగా వుంటారు. ఏ నీళ్ళతొట్లో పడుతుందో, ఎక్కడ కాలుజారుతుందోనని కనిపెట్టలేక సతమతమవుతున్నావా? మరి పిల్లలంటేఏమిటనుకున్నావు. ఇంకోరెండుమూడేళ్ళు నువ్వు పాపను చాలాజాగ్రత్తగా కనిపెట్టక తప్పదు. అలాఅని దాన్ని గదిలో బంధించనూకూడదు. ఆడుకోనివ్వాలి. ఈమధ్యన ఒకశిశువైద్య నిపుణుడు వ్రాసిన వ్యాసంచదివాను. పిల్లలకి అనుభవాలుకావాలట. ఒకమారు. కాలుజారితే మళ్లీవాళ్ళు పైప్దగ్గరికి వెళ్లరుట. అంచేత కాలుజారనివ్వాలని ఆయన ఉద్దేశ్యం కాదనుకుంటా! పిల్లల ఊహలు చాలా విచిత్రంగావుంటాయి.ప్రపంచాన్ని కొద్దికొద్దిగా అర్ధంచేసుకుంటూ వుంటారు. మాఇంటి ప్రక్కన ఒకపాప వుంది. పాపకి నాలుగేళ్ళు. చక్కగా కబుర్లు చెబుతుంది. బట్టలుమాపుకోదు. కాళ్ళకి బురద, మట్టీకాకూడదు. గచ్చుమీదకానీ వడవదు. చాలాబుద్ధి మంతురాలు.అయితే పాపకి ఎప్పుడూ ఆరోగ్యంసరిగా వుండదు ఎప్పుడూ అజీర్తి చేస్తోందంటుందివాళ్ళమ్మ. డాక్టరు దగ్గరికి తీసుకెళ్లింది. "పాపఆడుకుంటుందా?" అని ఆయన అడిగితే, "నేను పిల్లలతో కలసి ఆడనివ్వను. బట్టలన్నీమాపుకుంటుంది". అంది ఆవిడ. 'మీపాపని స్వేచ్ఛగా ఇల్లంతా తిరగనిస్తే, హాయిగా ఆడుకోనిస్తే ఆహారం బాగా జీర్ణమవుతుంది. మనస్సుకీ ఉల్లాసంగా వుంటుంది. అప్పుడే పాప బాగా ఆరోగ్యంగా వుంటుంది' అన్నాడట డాక్టర్. ఇప్పుడుపాపని ఆడుకోడానికి వదులుతోంది వాళ్ళమ్మ. చిన్నపిల్లల్తో దాగుడుమూతలాట, బంతిఆట, ఒకటేమిటిపాపపెద్ద 'స్పోర్ట్స్‌వుమన్' అయిపోయిందనుకో. తెలివితేటలు కూడా అభివృద్ధిఅయ్యాయంటుంది వాళ్ళమ్మ. అయితే పాపబట్టల మురికి వదిలించడం తనతరంకావడంలేదు!

మీపాపాయినికూడా అలా మరీబుద్ధి మంతురాలిని చేయాలని చూడకేం.ఇంట్లో అమ్మతో పాటే కొంగుపట్టుకు తిరిగేపాపలు కొత్తవాళ్ళనిచూస్తే భయపడి ఏడుస్తారు. పాపలకి అలా కొత్త అలవాటుచెయ్యకూడదు. వాళ కి మనింటికొచ్చిన అతిధులని పరిచయంచేసి చనువుచేయాలి. చనువుచేయాలంటే వాళ్ళ జేబులోపెన్ను బయటికిలాగాలనీ, జుత్తుపీకాలని,మీదనెక్కి గంతులువేయాలనీ కాదు. పిల్లలకి చిన్నతనంనుంచే చిన్నచిన్నపనులు, చక్కని అలవాట్లు నేర్పాలి. "పెద్దయ్యాక నేర్చుకుంటారులే" అని వూరుకోకూడదు.

పాపకి చిన్నచిన్న గ్లాసులతోనీళ్ళుపట్టుకొచ్చి మొక్కలకి పోయాలనివుంటుంది. నాన్నగారికి కాఫీకప్పు ఇవ్వాలనివుంటుంది. అమ్మకి కూరతరిగి యివ్వాలని వుంటుంది. పెద్దవాళ్లలా చీరె కట్టాలనివుంటుంది. మెషిన్‌మీద బట్టలుకుట్టాలని. చిన్నగౌను ఉతుక్కోవాలని కూడా అనిపిస్తుంది. గౌన్లు ఉతుక్కోడం కూరతరగడం పాపకి యిష్టం కదా అని ఆపనిచేయనివ్వంఅనుకో. అయితే నీతోపాటే మొక్కలకినీళ్ళు పోయనివ్వచ్చు. ఆపనిచేయనిస్తే పాపకెంతో సంతోషం. "ఏయ్, ఏమిటాఅల్లరి జలుబు చేస్తుంది. ఫో, లోపలికి" అని గదమాయిస్తే పాప చిన్నారి హృదయం చివుక్కుమంటుంది.

పిల్లలతో చాలాసున్నితంగా, లౌక్యంగా వ్యవహరించాలిగాని, వాళ్ళని చీటికీమాటికీ గదమాయించి, వీపుమీద ఒక్కటి 'అంటించ'కూడదు. అలా చేస్తే 'అమ్మ' అంటే "అమ్మో రాక్షసి" అనుకుంటుంది పాప. పాపకి అమ్మమంచి స్నేహితురాలుగా వుండాలి. గానీ, పాపమీద తనపెద్దరికపు అధికారం చెలాయించకూడదు. పిల్లలని చాలాతెలివిగా క్రమశిక్షణలో పెట్టాలి.

కొంతమంది "బ్లేడుముట్టుకున్నావంటే కొడతా" అంటారుగాని "బ్లేడు ముట్టుకుంటే వ్రేలుతెగుతుందమ్మా"అని చెప్పరు. "ఎప్పుడూ నీళ్లతో ఏమిటా ఆటలు, పదలోపలికి!" అంటారుగానీ, "నీళ లోనానితే జలుబు చేసి జ్వరం వస్తుందమ్మా" అనరు.

అంత ఓపిక వుండదు వాళ్ళకి. పిల్లలు తమచేతిక్రిందివాళ్ళు. తాముచెప్పింది తు.చ తప్పకుండా ఆచరించాలి అనుకుంటారు. ఒక్కొక్కసారి ఇంట్లో ఎవరిమీదైనా కోపం వస్తే పిల్లలనితిడుతూ వుంటారు. ఒక్కొక్కసారి కొట్టనూ కొడతారు. ఇలాంటి వాళ ని గూర్చి చెప్పేందుకు ఏముంది? పిల్లలు ఉత్తమ సంస్కార సంపన్నులూ, మేధావంతులూ అయి జీవితాన్ని సుఖప్రదంచేసుకోవాలని కోరేతల్లి, పిల్లల విషయంలో విసుక్కోడం అవివేకం, అజ్ఞానం కూడా . మాతృత్వంతోపాటే ఓర్పుకూడా అలవడాలి స్త్రీకి. అలవడుతుంది కూడా. "మాఅమ్మాయికేం డాక్టరు అవుతుంది" అంటుందొకతల్లి తన ఐదేళ్లకూతుర్ని చూసుకుని మురిసిపోతూ. అయితే ఆపిల్ల డాక్టర్ కావడానికి తనతోడ్పాటు చాలా అవసరమని, ఆపిల్లకి చదువులో శ్రద్ధ కలిగేలా చేయాలనీ ఆవిడ మర్చిపోకూడదు.

చాలా పెద్ద ఉత్తరంవ్రాశానేమో. పాపకి నీలా బద్ధకం అలవాటు చేయకేం! అది చురుకుగా, ఉత్సాహంగా వుండాలి. వాళ్ళ నాన్నగారిలా.........

మీ

అక్క.

# చంద్రగిరి పయనం

ఎస్. వి. రమణమూర్తి పట్నాయక్


చంద్రగిరిలో టిబెట్ కాందిశీకుల శిబిరాలు.

ఒరిస్సాలోని ముఖ్య పట్నాలలో ఒకటయిన బరంపురం పరిసరాల్నిదాటి 34 మైళ్లు ప్రయాణంచేస్తే 'తప్తపాణి' వస్తుంది. తప్తపాణి వేడినీటి వూటలకి ప్రసిద్ధి చెందిన స్థలం. ఈ వేడినీరు చాలా రోగాలకి మంచిదంటారు. ఎందరో వ్యాధిగ్రస్తులు ఇక్కడికి వచ్చిపోతూఉంటారు. అంతేకాక విలాస విహారాలకి కూడా ఎందరో తప్తపాణికి వస్తారు!

తప్తపాణినుంచి విచిత్రంగా మెలికలు తిరిగే రోడ్డువిూద 16 మైళ్లు వెడితే 'చంద్రగిరి' చేరుకుంటాము. ఈ పేరు ఎలా వచ్చిందో చెప్పే కథ లెన్నో ఉన్నాయి కాని పున్నమినాడు ఇక్కడికి వెడితే సార్థక నామధేయమనే అనిపిస్తుంది.

కొన్నిసంవత్సరాలక్రితం (1960-61) చైనా దురాక్రమణని తప్పించుకొనటాని కని కొందరు టిబెట్ దేశీయులు కాందిశీకులుగా భారతదేశానికి వచ్చారుకదా! అటువంటివారికి కొందరికి భారత ప్రభుత్వం చంద్రగిరిలో ఆశ్రయం ఇచ్చింది. 1964 దాకా చంద్రగిరి పరిసరాలలో టిబెట్ కాందిశీకులకి 5400 ఎకరాలదాకా నివాసస్థానంగా ఇప్పించింది. వీటిలో 2500 ఎకరాలు పంటభూమిగా కేటాయించారు. కాందిశీకులకి మూడు శిబిరాలు ఏర్పరచారు. ఈ శిబిరాలలో 450 వసతిగృహాలు కట్టారు. వీటిల్లో మొత్తం 1087 టిబెట్టువారు నివసిస్తున్నారు. (1964 వరకూ దొరికిన లెక్కలనిబట్టి). మొదటి 18 నెలలూ మనిషికి రోజుకి రూ. 1.18


నృత్యానికి సిద్ధంగా ఉన్న టిబెట్ బాలబాలికలు.

కూడా భత్యం ఇప్పించారు.

ఈ టిబెటీయుల నిత్య జీవితం, ఆచార వ్యవహారాలూ, సాంఘిక వ్యవస్థ మొదలయినవి మనకి ఆనందాశ్చర్యాలని కలిగిస్తాయి.

శిబిరాలలో కనిపించే టిబెట్ దేశీయులలో సాధారణ వ్యక్తులేకాక, 'లామా'లు 'ఖంపా'లు, 'నిమా'లు కూడా ఉంటారు. 'ఖంపాలు', యోధులు. 'లామా'లు బౌద్ధ సన్యాసులు, 'నిమా'లు సంసారం చేసుకునేవారు. ఇక్కడ ఖంపాల సంఖ్య చాలా తక్కువ. నలుగురు మాత్రమే ఉన్నారు!

లామాలుమాత్రం 500 మందిదాకా ఉన్నారు. వీరి జీవితాలు చాలా కట్టుబాట్లతో నిండిఉంటాయి. బ్రహ్మచర్యం స్వీకరించాలి తక్కిన మూడు శాఖల వారితో ఏ సంబంధ బాంధవ్యాలనీ పెట్టుకోరాదు. జీవితం అంతా బుద్ధుని పూజకే అంకితం చెయ్యాలి. ప్రతి కుటుంబంలోనూ మొదటి మగబిడ్డని లామాగా తర్ఫీదు చేస్తారు.


పూర్తి అలంకరణతో నృత్యానికి సిద్ధంగా ఉన్న స్త్రీ పురుషుల బృందం.

పూజలు నేర్పి, తలగొరిగించి, యుక్త వయసురాగానే లామాల శిబిరానికి పంపించేస్తారు. నేను అక్కడే శిరోముండనం చేయించుకున్న ఒక చిన్న అబ్బాయిని "ఎందుకు తలగీయించేశా"వని అడిగాను. "లామాని కాబోతున్నాను కాబట్టి!" అన్నాడు ఆ బాలుడు.

లామాల పూజ ప్రతిదినం మధ్యాహ్నం 1 గంటకి ప్రారంభం అయి, 50 నిముషాల మంత్ర పఠనం జరుగుతుంది. పూజా మందిరంలో బుద్ధుడి విగ్రహం, దానికి తోడుగా బుద్ధుని జీవితంలోని 'మూడు దశ'లని సూచించే విగ్రహాలు ఉంటాయి. 'జాచబ్', 'జెరప్ బాబా', 'ఖిడు' ఈ మూడు దశల పేర్లు పూజలు అన్నిటికీ జరుగుతాయి ఈ మందిరంలోనే గాంధి, నెహ్రూల బొమ్మలు కూడా ఉంటాయి. గాంధిజీని లామాలు, "సర్వమానవ పిత" అంటారు.

1964 లో దలైలామా ఇక్కడికి

ఒకసారి వచ్చారు.

నిమాలు, తక్కిన సాధారణ వ్యక్తుల లాగే సంసారులు. వారిలో నిమాలుకొంచెం ఎక్కువ నాగరికత కలవారనిపిస్తుంది. ఇళ్ల బయట భూత ప్రేతాలు లోనికి చొరకుండా రంగు రంగుల గుడ్డ పేలికలని, బంధాలతో జత పరిచి తగిలిస్తారు.

వీరి జీవితం నిరాడంబరంగానే సాగినప్పటికీ అలంకరణ అంటే మాత్రం ఇష్టం. ప్రతి ఇంటి బయటా ఒక చిన్న అందమయిన పూలతోట వేస్తారు.

వీరిలో బహు భార్యా పద్ధతులు ఉన్నాయి స్త్రీలకి 18 ఏళ్లు నిండనిదే వివాహం చెయ్యరు

వీరి సంగీతం, నృత్యం మనకి విచిత్రంగానే తోచినా లలిత కళలలో వీరికి మంచి అభిరుచి ఉంది.

చంద్రగిరి కాందిశీకులకి మన ప్రభుత్వం ఎన్నో సదుపాయాలు కలిగించింది, కలిగిస్తోంది. వారూ కష్టపడి జీవనోపాధులు కలిగించుకుంటున్నారు. కాని వారి ధోరణి పరిశీలిస్తే మాత్రం, ఎప్పటికయినా మాతృదేశానికి తిరిగి వెళ్లకపోతామా అనే భావం మాత్రం మనకి పొడసూపుతుంది. ●






ప్రపంచంలోకల్లా అతి క్లిష్టమైన పదాల్లో రెండు రౌడీ, హృదయం. వీటిని నిర్వచించటం చాలా కష్టం. రౌడీ అనగా ఎవరు? "నీ స్నేహితులు" ఇది మాఇంట్లో ఉదాహరణగా ఇచ్చే జవాబు. నేను మొదట్లో చాలా మంచి వాణ్ణనికాని నా స్నేహితులందరు రాలుగాయి రౌడీలవటంచేత చెడిపోయానని వాళ్ల దృఢ నమ్మకం. అయితే మా పక్కింటి వరలక్ష్మి వాళ్లింట్లో ఇందుకు భిన్నమైన అభిప్రాయం ఉంది. నేనే పెద్ద రౌడీనని నా స్నేహంవల్ల నా స్నేహితులు చెడిపోయారని వాళ్ల అభిప్రాయం. మా పేటలో నేనూ నా స్నేహితులు కూడా రౌడీలమే నని ఎవరి కెవ్వరు తీసిపోమని నమ్ముతారు. కృష్ణభగవానుడు రౌడీ అవునా కాదా అన్న విషయంలో యశోదకి, గోపెమ్మలకీ అభిప్రాయభేదాలు ఉన్నాయి. రాముడు అనే బాలుడు ఉన్నాడనుకోండి. అతడు మిగిలిన వారికి రౌడీలా కనిపించడం, కనిపించకపోడం మిగిలినవాళ్లకి రాముడు అనే బాలుడు మీద ఉండే అనురాగంబట్టే మారుతుంది. లేక ఒకరి దృష్టిలో మరొకళ్లు రౌడీలా అనిపించటం అనుపించకపోవడంబట్టి, మరొకళ్లు అంటే ఆ మొదటి ఒకరికి ఎంత అభిమానమో తెలుసుకోవచ్చును. ఇదే గణిత శాస్త్రంలో చెప్పుకోవాలి అంటే మనం మరొకళ్లలో చూసే రౌడీతనాన్ని మన కున్న అభిమానంచేత హెచ్చవేసిన యెడల ఒకటి వచ్చును. దీనికి ఉదాహరణ నాకు మొదట్లో రౌడీలా అనిపించిన నరసింహారావు నా స్నేహం పెరిగినకొద్దీ మంచివాడులా కనిపించేవాడు. ఇప్పుడు నా దృష్టిలో నరసింహారావు చాలా గొప్పవాడు. ఇల్లా అతను మారటానికి ఆరేళ్లు పట్టింది. అతను మారిందేమీలేదు. నా దృష్టిమారింది. అంతే. అయితే దానికి కారణాలు కథా ఉన్నాయి.

సాధారణంగా చాలమందికి రౌడీ అనగానే గళ్లలుంగీ, నాలుగంగుళాల వెడల్పు బెల్టు, బనియను కే. శే. ఆర్. నాగేశ్వరరావు గుర్తుకు వస్తారు. అయితే నేను ఇటువంటి వేషధారణ చేసేవాడినని అందుకని వరలక్ష్మిగారింట్లో నన్ను రౌడీ అనుకున్నారనుకుంటే అది పొరపాటు. చిన్నప్పుడు వాళ్ల జామచెట్టు మీద ఉండే నా దృష్టి వాళ్ల వరలక్ష్మి కేసి తిరిగిందని పోల్చుకోడంచేత జనించిన కోపంలో ఇచ్చిన బిరుదు అది. కాని తప్పనిసరిగా ఈ రౌడీకి వాళ్ల వరాల మూటని కాళ్లు కడిగి ధారపోసారు. అది నా చదువు పూర్తయాక జరిగిన విషయం. పెళ్ళయాక నాకు తెలిసిన మరో విషయం, రౌడీలువేరు, రౌడీ అబ్బాయిలు వేరని. ఆ జ్ఞానం నాకు వరలక్ష్మే కలిగించింది.

పెళ్ళవకముందు నన్నుచూసి "ఈ రౌడీ అబ్బాయిని ఎవరైనా పెళ్లి చేసుకుంటారా" అని అనుకునేదిట. అనుకుంటే అనుకుంది. నాతో చెప్పింది. నాకు కోపం వచ్చింది. రౌడీ అన్నందుకుకాదు, అబ్బాయి అన్నందుకు. "రౌడీ అబ్బాయి ఏమిటి చెట్టంత మగాణ్ణి పట్టుకుని రౌడీ అనాలికాని" అని కేకలు వేసాను. "ఏమో మా ఆడపిల్లలు అంతా అల్లాగే అంటారు. రౌడీ అంటే..... అమ్మ బాబోయ్! వాళ్లంటే నిజంగా భయం వేస్తుంది. రౌడీ అబ్బాయిలంటే మేడ మీద కిటికీదగ్గర నిలబడి ఎదురింటి ఆడపిల్ల కనపడగానే నవ్వేవాళ్ళు రోడ్డుమీద ఎవరూ లేకుండా చూసి "నీ పేరిమిటి" అని అడిగేవాళ్లు వెనకాతల నడుస్తూ, "మీ రివాళ చాలా బాగున్నారు" అని పొగిడే వాళ్ళూను!"అని వివరించింది. పైగా వీళ్లను చూసి ("రౌడీ?") అమ్మాయిలు కొంచెం భయపడి, మరికొంచెం ఇష్టపడతారుట. రౌడీ అబ్బాయిలు సర్వ సాధారణంగా కొంచెం రౌడీతనం ఉంటూ, దానికితోడు అమ్మాయిలు కలలుకనే చదువు, అందం, డబ్బు కూడా ఉన్నవాళ్లుట.

మా నాన్నగారే దగ్గరుండి నా జుట్టు కత్తిరవేయిస్తున్నరోజుల్లో, అంటే స్కూలు ఫైనలు చదువుతున్న రోజుల్లో ప్రపంచం వన్నింకా మంచివాడుగానే పరిగణిస్తూ ఉండటంచేత నాకు నరసింహారావు రౌడీలా కనిపించాడు. అప్పటికింకా వరలక్ష్మి తమ్ముళ్లతో కుస్తీపట్టే వయస్సులో ఉండటం చేత రౌడీకి, రౌడీ అబ్బాయికి భేదం తెలుసుకుని నాతో చెప్పలేదు.

ఇంకపోతే రౌడీఅబ్బాయిహృదయం స్క్వేర్ రూట్ ఆఫ్ మైనస్ వన్‌లాగా ఊహాజనితమని అనుకుంటారు. కాని రౌడీ -అబ్బాయిలకు గూడా హృదయముంటుందని నా అభిప్రాయం. దానికి కారణం నేను కూడా ఆ కోవకి చెందినవాణ్ణవటంచే కావచ్చును. అయితే హృదయమనగానేమి ? చేతనమా ? ఆత్మ సంబధమా? ఇటువంటి ప్రశ్నలకి జవాబు తెలియదు. కాని నాకు తెలిసిందల్లా ప్రేమకి, హృదయానికి సంబంధ ముందని మాత్రమే. అందుకని ప్రేమించగలిగినవాళ్లకి హృదయమున్నట్టు తెలుసుకోవచ్చును. నిజమైన గట్టి ప్రేమ రౌడీ అబ్బాయిలకు కూడా కలుగుతుందని నరసింహారావు నిరూపించాడు. కనుక రౌడీ అబ్బాయిలకు హృదయముండి తీరాలి.

నరసింహారావు ప్రేమ ఒక దివ్య జ్యోతి. స్నేహంకోసం ప్రేమ త్యాగం చేసాడు. అయితే "ఇదుగోనండోయి నేను త్యాగం చేసాను" అని తెల్ల పంచ, సిల్కు లాల్చీ వేసుకుని బరువైన సంభాషణలు దొర్లిస్తూ కొట్టొస్తూ కనపడడుట. అందుకనే అతనిమీద ఎవరూ రెండు నవలలు, మూడు సినిమాలు వ్రాయ లేదు. తీయలేదు. (క్రమాలంకారము) మా స్నేహితుల్లో కొంచెం తెలుగు గుర్తున్న వాణ్ణి నేనే. అందుకని నరసింహారావు తెల్లటి హృదయాన్ని ప్రపంచానికి ఎత్తిచూపటం అనే బాధ్యత నామీద వేసారు.

నాది, నరసింహారావుది, శ్రీనివాసరావుది కూడా కాకినాడే. మా ఇల్లు సూర్యారావు పేటలో పిండాల చెరువుదగ్గర. అందుకని నేను మెక్లారిన్ హైస్కూల్లో చదువుకున్నాను. చిన్నప్పటినుంచి నరసింహారావు, శ్రీనివాసరావు, పి. ఆర్. కాలేజీ హైస్కూల్లో చదివారు. నాకు వాళ్లతో పరిచయం నేను ఆ కాలేజీలో ఇంటర్మీడియేటులో జేరాక కలిగింది. శ్రీనివాసరావు అస్కూలు ఫస్టు వచ్చాడు. సన్నగా తెల్లగా ఉండేవాడు. నరసింహారావు అందుకు విరుద్ధంగా దృఢంగా నల్లగా ఉండేవాడు. అందుకని నేను శ్రీనివాసరావుతో స్నేహాని కిష్టపడ్డట్టు నరసింహారావుతో చెయ్యటాని కిష్టపడలేదు. కాని తప్పనిసరి అయింది.

పరిచయం అయిన కొన్నాళ్లకి నేను, నరసింహారావు కాలేజీగేటుదగ్గరకలుసుకున్నాము. అతను ఉన్నట్టుండి "మీకు బొచ్చుకుక్క అంటే ఇష్టమేనా" అని అడిగాడు. "నాకు బొచ్చుకుక్కలంటే ఇష్టంలేదు. బొచ్చులేని కుక్కలన్నా ఇష్టంలేదు. అసలు కుక్కలంటేనే అసహ్యం" అన్నాను. అతను కాసేపాగి "నేనేదో సరదాగా అడిగితే మీరు అంత సీరియస్‌గా తీసుకుంటారేమండి? ఇందాక మనముందు నుంచి వెళ్లిందో రెండుజడల అమ్మాయి చూసారా? ఆఅమ్మాయి పేరు బొచ్చుకుక్క. అదే మారుపేరు" అని వివరించాడు నా అజ్ఞానానికి జాలిపడుతూ!

"మరి ఆ అమ్మాయి వెళ్లి మీ మీద ప్రిన్సిపాల్‌కి రిపోర్టుచేస్తే లేక చెప్పుచ్చుకు కొడితే" అన్నాను ఇంకా భయపడుతునే.

"శర్మగారూ! మీరుట్టి అమాయకులు. ఈ కాలేజీలో అమ్మాయిల్ని ఏడిపించని అబ్బాయిలు, ఆ మిగతా అబ్బాయిలకు, ఆఖరికి అమ్మాయిలకు కూడా లోకువే"అన్నాడు అక్కడి వాతావరణం బోధిస్తూ. నిజమే కాబోలు. అతను హైస్కూలు చదువుకూడా అక్కడే చదివాడు.

అయితే నేను ముందరే చెప్పానుకదా అప్పటికింకా నేను చెడిపోనేలేదని. ఇంకా మా అమ్మ ప్రతివారం అలవాటుగా తలంటి పోసేవయస్సు.అందుకని శ్రీనివాసరావుకికూడ నరసింహారావు వల్ల దూరంగా ఉంటూ వచ్చాను. ఆ రెండేళ్లలోను మా పరిచయం పెద్ద పెరగలేదు. ఇంటరు పరీక్షలలో నరసింహారావుకి నాతో సమానంగా మార్కులు రావటం నాకు ఆశ్చర్యం కలిగించింది. రౌడీ లెక్కడైనా చదువుతారా అని. ఈ మాటే ఎవరితోనైనా అంటే స్కూలు ఫైనలులో కూడా అతను ఆ స్కూలుకి రెండవ వాడుగా వచ్చాడని చెప్పారు.

అందుచేత కాకినాడ చదువు కట్టిపెట్టి విశాఖపట్నం పోయాము. శ్రీనివాసరావు తనేదో పెద్ద సైంటిస్టు కావాలని ఫిజిక్సు ఆనర్సులో జేరాడు. నేను నరసింహారావు ఇంజినీరింగులో చేరాము. ఇంజినీరింగు చదువు ఉత్సాహంతో గడిచిపోతోంది. నరసింహారావు ఇటు చదువులో అటు స్పోర్ట్సులో మరో పక్క ఆడపిల్లలకి పేర్లు పెట్టడంలోను కూడా విజృంభించాడు. నరసింహారావుని చూసి ఆడపిల్లలు వీడికి యూనివర్శిటీలో సీటెవరిచ్చారు అనుకోటం, ఇంజినీరింగని తెలిసి ఆశ్చర్యపోడం జరిగేవి.

ఒకసారి నేను, నరసింహారావు యూనివర్శిటీ కాంపస్‌లో నడుస్తూ ఉంటే"శర్మా! నువ్వేసారైనా కాల్‌క్యులస్ పాసయ్యావా?" అని అడిగాడు నరసింహారావు. ఇదేమిటి నేను పరీక్ష తప్పిందెప్పుడు అని ఆలోచిస్తూ ఉంటే మాముందు పోతున్న అమ్మాయి

# రౌడీ అబ్బాయి...

వెనక్కి తిరిగి కోపంగా "నేను పాస్ అయితే నీ కెందుకు? పాస్ కాకపోతే నీ కెందుకు?" అంది. నాకు కాళ్ళు చేతులు వణకటం మొదలు పెట్టాయి. నరసింహారావు క్లాసులో చెప్పాడు "ఆ అమ్మాయి పేరు కాల్ క్యులస్ సుందరి. ఆవిడ ఫైనలావర్సు కెమిస్ట్రీ. ఇంకా ప్రిలిమ్స్ పాస్ కాలేదు. బహుశః అవదు" అని. "ఆవిడ సంగతి మధ్య మన కెందుకు" అన్నాను. "న్యాయానికి అక్కర లేదు. కాని మామూలుగా షికారుగా నేనల్లా గర్ల్సు హాస్టలు ముందుగా బీచికి వెళ్తుంటే పై మేడ మీద చేరి ఎక్కిరిస్తుంది. అబ్బాయిల్ని ఏడి పించడం తన గొప్పతనం అని చాటుకుంటూ ఉంటుంది" అని వివరించాడు. ఏమిటో ఈ నరసింహారావు అనుకున్నాను.

మరోసారి ఆర్ట్సు కాలేజీ (పాత) మేడ మీద నుంచి ఒక అమ్మాయి మా వెనకాతల నడుస్తున్న మరొక అమ్మాయిని రమ్మని పిలిచింది. ఈ విషయం నరసింహారావుకు తెలియకపోలేదు. కాని ఆ అమ్మాయి తనను పిలిచినట్టుగా భ్రమపడ్డట్టు "నాకిప్పుడు ప్రొఫెసర్‌గారి క్లాసుంది. తరువాత కనిపిస్తాను" అని చరచర నడిచాడు.

ఇంకోసారి ఇంకో అమ్మాయిని రోడ్డు మీద నిలేసి "మీ పేరు రాధ కదండి. మీ సంగతి ఆ విద్యాదేవి చెప్పింది. మీది రాజమండ్రి కదూ! ఏ కాలేజీలో చదివారు?" అని హడావిడిగా అనేసాడుట. ఆవిడ ఎవరో ఘటికురాలు "రాజమండ్రిలో ఎన్ని కాలేజీలు ఉన్నాయండి? ఇంతకూ ఆ విద్యాదేవి ఎవరో నాకు తెలియదు" అందిట నిర్మొహమాటంగా. దాంతో నరసింహారావు నాదగ్గరకి పరిగెత్తుకుంటూ వచ్చి "గురూ! క్లీన్ బౌల్డు. మధ్య స్టంపు ఎగిరి మూడుగజాల అవతల పడింది" అంటూ నవ్వేసాడు. అపజయాలు ఎప్పుడూ నరసింహారావుని బాధించలేదు.

నేనెప్పుడైనా "ఏ అమ్మాయి తండ్రో, అన్నో నిన్ను తన్నడానికి తప్పకుండా వస్తాడు" అంటే "ఆ తన్నడానికి వస్తే మనమేమా వూరుకునేది" అనేవాడు.

"ఏం చేస్తావేం?"

"ఇన్నాళ్ళుగా ఇన్ని పరుగు పందాల్లో పాల్గొన్నాను. ఆమాత్రం అందకుండా పారిపోలేనా" అనేవాడు కళ్ళు చికిలించి, నవ్వుతూ.

ఇల్లాంటి వేషాలే ఏ రాజకపూరో, దేవానందో, నాగేశ్వరరావో వేస్తే సినిమాల్లో చూసి ఆనందించే అమ్మాయిలు, ఉపాధ్యాయులు నరసింహారావుని రౌడీ అన్నారు. అయితే మీరు అతను రౌడీ కాదా అని నన్ను అడుగ వచ్చును. పైదంతా చదివిన వాళ్ళు అల్లా అడగటంలో తప్పులేదు. ఇంతవరకు అతని తెల్లటి హృదయం గురించి వ్రాయలేదు. తేదీల ప్రకారం వ్రాయటం వల్ల ఈ ఇబ్బంది వచ్చింది. అతని మంచితనం తెలిపే సంఘటన మూడో ఏడు చివర జరిగింది.

ఒకరోజు నరసింహారావు, నేను, శ్రీనివాసరావు చీకటిపడ్డాక బీచి వెంబడి నడుస్తున్నాము. అప్పుడు చీకటి, అప్పుడే యౌవనంలో అడుగు పెడుతున్న రౌడీ అబ్బాయి మీసంలా నల్లబడుతోంది. అక్కడక్కడ మునిసిపాలిటీ వాళ్ళ దీపాలు, లాస్టు బెంచీలో ఫస్టు వచ్చిన వాడులా, కులంలో తప్పబుట్టినవాడిలా, ఆ చీకట్లో మిగిలిన దాంతో కలవకుండా మినుక్కు మినుక్కుమని వెలుగుతున్నాయి. ఆ రోజు సీతాలక్ష్మి ఊళ్ళో ఉన్న పినతండ్రిగారి కుటుంబంతో బీచికి వచ్చి కొద్ది దూరమే కదా అని ధైర్యం చేసి విడిపడి, ఒంటరిగా, కొంగుతో ఒళ్ళంతా కప్పేసుకుని భూమినే చూస్తూ, ఘుమ్మిందే నడుస్తూ హాస్టలుకు పరిగెత్తుతున్న వేగంతో నడుస్తూ మాకు కనిపించింది. బీచి నిర్మానుష్యంగా ఉంది. నరసింహారావును ఎప్పుడు చూసిందో తెలియదు కాని, భయపడి వేగం హెచ్చించింది. నరసింహారావు వేదాంతిలా నవ్వి ఊరుకున్నాడు. కాని అంతవరకు ఇసుక దిబ్బల వెనుక ఉన్న రెండు యువక సింహాలు, స్లాక్సు తాలూకు చేతులు తమ బైసెప్సు కనపడేలా మడత పెట్టి, తమ తాలూకు చేతుల్లో సిగిరెట్లు పట్టుకుని విలాసంగా బయటికి వచ్చి పరిగెత్తుతున్నటు నడుస్తున్న సీతాలక్ష్మి వెనకాతల నడి "ఏమండి మాకేసి చూడ రాదా! మీ పమిట కొంగు తగిలితేనే మా జీవితం ధన్యమవుతుందనుకునే మాకు ఆ అదృష్టం కలుగకుండా నిండుగా కప్పుకున్నారు కదా, మీ నంపుల సొంపులు.." అంటూ అవాకులు చెవాకులు మాట్లాడుతూ నడుస్తున్నారు. స్వతహాగా ధైర్యవంతుణ్ణి కాని నేను "మనం తొందరగా పోదాం" అన్నాను శ్రీనివాసరావు "అవును అదే మంచిది" అన్నాడు.

నరసింహారావు మటుకు "పాపం ఒంటరిగా ఉన్న ఆవిడను ఆ వెధవలు అల్లా అల్లరి పెడుతుంటే చూస్తూ ఊరుకుందామా?" అని మా జవాబు కోసం ఎదురు చూడకుండా వెళ్ళి అందులో ఒకడి జబ్బ పుచ్చుకుని "ఏం వంట్లో బాగాలేదా? ఆఅమ్మాయి మిమ్మల్ని ఏం చేసిందని?" అని అడిగాడు.

"అనవసరంగా మా జోలికి రాకండి" అన్నాడు ఒకడు.

"ఈయన సంగతి మనకి తెలియదనుకుంటున్నాడు. అందుకే నీతులు బోధిస్తున్నాడు" అన్నాడు హుషారుగా రెండోవాడు.

"నేను బుద్ధిమంతుణ్ణని చెప్పటంలేదు. కాని నేను తలవొంచుకుపోయే అమ్మాయిల జోలికి పోను" అన్నాడు నరసింహారావు. ఆపైన "ఎవరైనా పోతే ఊరుకోను."

అంతే మాట మాట పెరిగి కలబడ్డారు. నేను, శ్రీనివాసరావు కూడా కలిపించుకుని విడదీసి సర్ది పంపేసాము. ఈ హడావిడిలో నరసింహారావుకి "థాంక్సు" చెప్పాలన్న భావం కూడా కలగక, లేక అవసరం లేదనుకునో సీతాలక్ష్మి పరిగెత్తుకు హాస్టలుకు చేరుకుంది. ఆతరువాత నరసింహారావు చెప్పాడు. "నేను అబ్బాయిల జోలికి వచ్చే రౌడీ అమ్మాయిల్ని అల్లరి పెడతాను కాని, బుద్ధిగా ఇతర్ల జోలికి రాకుండా ఉండే అమ్మాయిలను గౌరవిస్తాను. ఇంకోళ్ళ గౌరవించకపోతే బాధపడతాను." మనం రౌడీలనుకునే వాళ్ళకి కూడా నీతి నియమాలు ఉంటాయి. వాళ్ళకున్న విచక్షణా జ్ఞానం ఒక్కోసారి మనలాటివాళ్ళ కుండదు.

ఆ వేసంగి సెలవల్లో ఇంటికి వెళ్ళినప్పుడు నరసింహారావు మా యింటికి వచ్చి పక్కింటికేసి చూసి "ఎవరి అందా

తరిణః అదృష్టవంతుడివి.” అన్నాడు. ఎవరా అని చూసాను. వరలక్ష్మి వోణీలు వేసుకుంటోంది. ఈసారి జామచెట్టు కింద నిలబడి ఉంది. మీాద కాకి. అంత వరకు వరలక్ష్మి అందమైనదని నాకు తట్టలేదు. “నీకు నచ్చిందా” అన్నాను. “నీదిగా నాకు నచ్చింది. నాకు మిత్ర ద్రోహం అలవాటులేదు” అన్నాడు. ఆ తరువాత వరలక్ష్మి నావంక చూస్తే నవ్వడం మొదలుపెట్టాను. మొదట్లో భయపడి రెండు మూడు రోజులు కనిపించడం మానేసింది. తరువాత ఎవరూ చూడకుండా కిటికీ దగ్గరికి చేరేది. ఆ రోజుల్లోనే నేను వరలక్ష్మికి రౌడీ అబ్బాయిగా, వాళ్ల ఇంట్లో వాళ్లకి రౌడీగా కనిపించాను. ఆ ఏమైతేనేం, నాకు నరసింహారావు చాలా ఉపకారం చేశాడు. వరలక్ష్మిని నా దృష్టికి తెచ్చి.

తిరిగి మేము విశాఖపట్నం వెళ్లిన కొన్నాళ్లకి ఓరోజు నేను నరసింహారావుని పిలుస్తుంటే వినిపించుకోనట్టు వెళ్లిపోడం మొదలుపెట్టాడు. నేను గబగబా వెళ్లి నరసింహారావుని పట్టుకుని “ఏం? పిలుస్తుంటే వెళ్లిపోతున్నావు” అన్నాను.

“నాపేరు నరసింహారావు కాదు. వసిష్ఠ. పిలువదల్చుకుంటే అల్లాగే పిలు.”

“ఇదేం బుద్ధి”

“ఈ ఏడాది న్యూక్లియరు ఫిజిక్సు ఎం. ఎస్సి. మొదటి సంవత్సరంలో చేరిన అమ్మాయిల్లో అరుంధతి అన్న అమ్మాయి నా హృదయం దొంగలించింది. మన పేరుకు వీలుగా ఆవిడపేరు వెంచులక్ష్మి చెయ్యటం కంటె, ఆవిడ పేరుకి అనుగుణంగా నాపేరు మార్చుకోటం ఉత్తమము అని అల్లా చేసాను.” అని గంభీర ముద్ర వదిలి పకపకా నవ్వేశాడు.

శ్రీనివాసరావు ఫిజిక్సు ఆనర్సు పూర్తిచేసి ఎమ్. ఎస్సి రెండో సంవత్సరంలో జేరాడు. అతని వంకగా నరసింహారావు నన్ను ఆ డిపార్టుమెంటుకు తీసుకువెళ్లి అరుంధతిని చూపించాడు. ఆ అమ్మాయి కనుముక్కు తీరు ఏమీ బాగాలేదు. ఆమాటే అతనితో అంటే “ఆడవాళ్లకు పెద్ద కళ్ళు, నాజాకు ముక్కు ఉంటేనే అందం అని, ఆడది మెచ్చిందే అందం అని మనకి చెప్పి ఆడవాళ్లు మోసం చేస్తారు. ఆరోగ్యం, అంగసౌష్ఠవం ఉన్న అమ్మాయి అయినా అందంగానే ఉంటుంది నాకు. పెద్ద కళ్లు ఉండి పుల్లలా ఉన్న అమ్మాయి అందమైందంటే నేను ఒప్పుకోను. మన అమ్మలకి, అక్కచెల్లెళ్లకి మనం నిజమైన అందాన్ని పోల్చుకుంటే ఆ ధ్యానలో పడి వాళ్లకి దూరమవుతామేమో అని భయం. అందుకనే అందము విషయంలో వాళ్ళు కూడా మనని మోసం చెయ్యటానికి చూస్తారు. తెలుపురంగే అందమని భావించే మన దేశంలో నా అభిప్రాయాల్తో చాలామంది ఏకీభవించకపోవచ్చును.” అన్నాడు. నాకు అనాటి నరసింహారావు మాటల్లో సత్యం వయస్సు వచ్చినకొద్దీ అర్థమవుతోంది.

నరసింహారావు అరుంధతిని ప్రేమించాడు. ఆ విషయం మాకు తెలుసు కాని అరుంధతికి తెలిసే దిల్లా. తన మామూలు ధోరణిలో పలకరించుదామని చూసాడు కాని ఆమె సహకరించలేదు. అరుంధతి ఎదురుపడగానే ఎక్కడలేని బుద్ధి వచ్చేది నరసింహారావుకి. తను పెద్దమనిషిలా కనిపించడానికి ప్రయత్నించేవాడు. ఆడపిల్లలు పెద్దమనుషుల్ని పెద్దగా పట్టించుకోరన్నా విషయం మన కొందరికి తెలుసు. ఆడపిల్లలు బుద్ధిగా ఉండే అబ్బాయి కంటే తమకేసి పదిసార్లు చూసే వెంకి అబ్బాయిని ఇష్టపడతారని ఆ తరువాత వరలక్ష్మి చెప్పింది. నరసింహారావుకి ఆమె దృష్టి నాకర్షించడానికి ఏమి చెయ్యాలో తోచలేదు. ఆటల పోటీలు ఏడాది పొడవునా ఉన్నాయి. అందుకని దూరం నుంచి చూడ్డంతో సరిపెట్టుకున్నాడు. అతను మనోవాక్కాయ కర్మలచేత అరుంధతిని ప్రేమించాడు.

అయితే అదృష్టంకొద్దీ డిసెంబరులో శ్రీనివాసరావు వాళ్లతో అరుంధతి కూడా టూరుకి వెళ్లడంచేత శ్రీనివాసరావుకి, అరుంధతికి పరిచయం కలిగింది. అందుకని నేను శ్రీనివాసరావుని, నరసింహారావుకి అరుంధతికి పరిచయం కలుగచెయ్యమని అడిగాను. “దానికేముంది. రేపు మీా రిద్దరూ మా లాబ్‌కి రండి” అన్నాడు శ్రీనివాసరావు.

మర్నాడు నేను నరసింహారావు, శ్రీనివాసరావు వాళ్ళ లాబ్‌కి వెళ్లాము. అక్కడ మాకు అతను అన్నీ చూపిస్తున్నట్టు నటిస్తూ అరుంధతి దగ్గరికి తీసుకువెళ్లి పరిచయం చేశాడు. నరసింహారావు పెద్ద ఆటగాడని కూడా చెప్పాడు. కాని ఎప్పుడూ ఆడపిల్లలతో చొరవతో మాట్లాడే నరసింహారావు బిగుసుకు



పోయాడు. ప్రతి నమస్కారము చెయ్యటం తప్ప ఏమీ చెయ్యలేకపోయాడు. ఆమాటే తరువాత అంటే "మనస్సులో ఏవిధమైన భావాలు లేనప్పుడు ఏ ఆడపిల్లతోనైనా ఏ విషయమైన మాట్లాడవచ్చు. కాని ప్రేమించిన అమ్మాయితో మాట్లాడ్డానికి మాత్రం గొంతు డెక్క పట్టేస్తుంది. గుండె వేగంగా కొట్టుకుంటుంది. మొహం గంభీరమైపోతుంది" అని ప్రేమ లక్షణాలు వివరించాడు.

తరువాత చాలాసార్లు నోట్సు ఇచ్చే మిషతోనూ తీసుకునే మిషతోను ఆడపిల్లల హాస్టలుకు వెళ్ళినప్పుడల్లా శ్రీనివాసరావు, నరసింహారావుని తీసుకు వెళ్ళేవాడు. అయితే నరసింహారావు ప్రేక్షకుడుగా మిగిలిపోయేవాడు. ఒకరోజు శ్రీనివాసరావు "నేను, అరుంధతి, మరికొంతమంది స్నేహితులు కలిసి సినిమాకి వెళ్తున్నాము. నువ్వు కూడా" అంటూ పిలిచాడు శ్రీనివాసరావుని. ఆరోజు నాకు చాలా జ్వరంగా ఉంది. "శర్మకి చాలా జ్వరంగా ఉంది. అతన్ని వదిలేసి నేను సినిమాకి రాను!" అన్నాడు నరసింహారావు.

"పరవాలేదు. నువ్వెళ్ళు" అన్నాను కాని అతను వినిపించుకోలేదు నరసింహారావు,

## రౌడీ అబ్బాయి...

శ్రీనివాసరావు వాళ్ళ వాళ్ళ ప్రోగ్రామ్ వాయిదా వేసుకుంటారేమో అని అనుకున్నాడు. కాని అది అల్లా జరగలేదు. అయినా అతను బాధపడలేదు. అతని మంచితనం నన్ను మరొక్కసారి ఆశ్చర్య పరిచింది.

నరసింహారావు ప్రేమ లక్షణాలు వృద్ధి అవటం మొదలుపెట్టిన దగ్గరనుంచి పరీక్షలు దగ్గర పడటం మొదలు పెట్టాయి. మేము బుద్ధిగా పరీక్షలు వ్రాసేటట్టు, ఆ తరువాత నరసింహారావు ప్రేమ అరుంధతికి శ్రీనివాసరావు తెలియజేసేటట్టు ఒప్పందం చేసుకున్నాం. పరీక్షలయిపోయాక నేను "శ్రీనివాసరావు బదులు నీ సంగతి నువ్వే అరుంధతికి చెప్పు" అన్నాను నరసింహారావుతో. పైగా "ఆమెకు నువ్వేవిధమయిన అభిప్రాయంకలిగించకుండా, ఆమెను ప్రేమించమంటే ఎల్లా ప్రేమిస్తుంది. మంచి చదువు, కొంచెం డబ్బుతో ఉండి అనాకారి కాని అబ్బాయి ఏ అమ్మాయితో నైనా ప్రేమిస్తున్నానని చెప్తే ఆడపిల్లలు గర్వపడతారు. అదే ఇతర్లచేత చెప్పిస్తే గర్వపడరు." అని కూడా చెప్పాను.

అంతా విని "పరవాలేదు. శ్రీనివాసరావు చెప్తాడులే" అన్నాడు.

కొన్ని రోజుల తర్వాత శ్రీనివాసరావు చెమటలు కారుతూ మా రూమ్‌కి వచ్చాడు. అప్పుడు నరసింహారావు గదిలో లేడు. శ్రీనివాసరావు ఎంతసేపటికీ మాట్లాడలేదు. నేను బలవంతం చేసాక చెప్పడం మొదలు పెట్టాడు.

"నిన్న నేను, అరుంధతి బీచికి వెళ్ళాం. నేను అవిడతో నేను కొన్నాళ్ళుగా ఓ విషయము మీతో చెప్పాలనుకుంటున్నాను అన్నాను ఎల్లా మొదలు పెట్టాలో తెలియక తెలియక.

"నేనూ మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను" అంది అరుంధతి.

"అయితే చెప్పండి" అన్నాను.

"మీరే ముందర చెప్పండి" అంది.

"మనస్సులకి సంబంధించిన విషయం."

"నాదీ అంతేలెండి" అంది అరుంధతి సిగ్గుపడుతూ.

"మిమ్మల్ని ఎవరైనా ప్రేమిస్తే మీకు ఆ సంగతి చెప్తే ఏం చేస్తారు" అన్నాను.

"ఆ పరిస్థితుల్లో మీరేం చేస్తారు ?" అని ఎదురుప్రశ్న వేసింది.

"నన్ను ప్రేమించేవాళ్ళు ఉండాలే కాని తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను!" అన్నాను తెలివిగా జవాబు చెప్పానని సంతోషిస్తూ.

"అయితే మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను" అంది అరుంధతి.

నాకేం జవాబు చెప్పాలో తెలియలేదు. రెండు రోజుల్లో సమాధానం చెప్తానని చెప్పాను. నాకు ఇప్పుడు ఏం చెయ్యాలో పాలుపోడంలేదు. నరసింహారావుతో ఈ విషయం నేను చెప్పలేను. దయచేసి నువ్వు చెప్పు" అని శ్రీనివాసరావు ముగించి తన రూమ్‌కి వెళ్ళిపోయాడు.

నరసింహారావు దీన్ని ఎల్లా తీసుకుంటాడో! ప్రేమ వ్యవహారాల్లో ఇతర్ల జోక్యం మంచిదికాదు. ఎవరివి వాళ్ళే పరిష్కరించుకోవాలని చెప్తే విన్నాడు కాదు. ఏం జరిగితే అది జరుగుతుందని నరసింహారావు వచ్చాక జరిగిన విషయం చెప్పాను.



అతను తొణకలేదు.

"అరుంధతి శ్రీనివాసరావుని ప్రేమిం
చింది కనుక ఆవిడకేసి నేను కన్నెత్తి
కూడా చూడను. శ్రీనివాసరావుకి అరుం
ధతి అంటే ఇష్టం ఉంటే ఇద్దరూ
పెళ్లి చేసుకోడం మంచిది. శ్రీనివాసరావు
నాకోసం త్యాగం చేస్తానన్నా ఆవిడను
చేసుకోను" అని తెగేసి చెప్పేడు. అతని
మొండి మాటల వెనుక గాయపడిన తన
హృదయాన్ని దాచేసుకుంటూ. మగవా
డెవడూ ఇతర్లని ప్రేమించిన స్త్రీని పెళ్లిచేసు
కోడానికి మామూలుగా ఇష్టపడడు. కనుక
నరసింహారావు అరుంధతిని చేసుకునేది లేదు
అతను గాయపడ్డాడు. కనీసం అరుంధతి
అయినా బాధపడకుండా ఉండాలంటే
శ్రీనివాసరావు ఆమెను చేసుకోడం
ఉత్తమం.

మర్నాడు "నరసింహారావు ఏమీ అను
కోకపోతే నా కిష్టమే" అన్నాడు శ్రీనివాస
రావు.

"ఈనాటి ది నా వసిష్ఠ బిరుద
నామధేయాన్ని త్యజిస్తున్నాను." అన్నాడు
నరసింహారావు నవ్వేస్తూ. ఆ నవ్వుకి అతని
కళ్లల్లో నీళ్లు తిరిగాయి. బిరుదుల్ని
త్యజించటం ఎంత కష్టమైన పనో
ఈనాడు కనిపించే రావుబహదూర్లని, సాహి
బుల్ని చూస్తే తెలుస్తుంది.

శ్రీనివాసరావు పెళ్లిలో నరసింహా
రావు హడావిడిగా తిరుగుతున్నాడు. అతని
కళ్లలో పూర్వపు మెరుపు లేదు. ఇంతలో
ఒక అమ్మాయిని "మీపేరు సరోజ
కదండీ. మీది బందరు అవునా" అని
పిలిచియ్యటం కనిపించింది. కాని ఆ ఉత్సా
హము వెనుక, హడావిడి వెనుక అతను
మింగిన హాలాహలం ఉంది. అతని చిలిపి
తనం వెనుక సున్నితమైన హృదయం
ఉంది. ఆ హృదయం ప్రేమించే శక్తి
గలది. కాని ఆ రౌడీ అబ్బాయి తన
ప్రేమను గాయాన్ని ప్రపంచానికి కనపడ
కుండా దాచేసుకున్నాడు. ●










# హఠాత్సంభవమా? క్రమపరిణామమా?

—సర్ చార్లెస్ లయెల్—

—డాక్టర్..

సూర్య కుటుంబము ఏ రీతిగా ఏర్పడి ఉంటుందీ? అన్న ప్రశ్నకి రెండు జవాబులున్నాయి. ఒకటి "సూర్యుడికి చేరువగా ఏదో నక్షత్రము దూసుకుపోవడములో అది ఆకర్షించడమువల్ల పేద్ద దొండకాయ ఆకారములో బయటికి వచ్చిన సూర్యగోళపు వాయు వస్తువు కాలక్రమాన్న ద్రవీభవించీ, ఘనీభవించీ ఏర్పడింది" అంటుంది రెండోది "జ్యోతిర్మేఘ సమేతమైన సూర్య గోళము, క్రమంగా చల్లారడములో ఆ మేఘము ద్రవీభవించీ, ఘనీభవించీ ఏర్పడి ఉంటుంది" అంటుంది. ఈ రెండు జవాబుల వెనకా రెండు వ్యతిరేక వాదాలున్నాయి గుర్తించండి అంటున్నాను. ఒకటి హఠాత్సంభవాలు ఉంటాయనీ, వాటి ఫలితంగా సూర్య కుటుంబమువంటి అద్భుత సృష్టి కూడా జరగగలదనీ నమ్మేటిది; ఇంకొకటి, ఏ అద్భుతమైనా సృష్టిలో మనకి స్ఫుటముగా గోచరించే శక్తుల ప్రభావమువల్ల క్రమ – పరిణామముగానే రూపొందుతుందికాని హఠాత్తుగా జరగదు, అనేటిది. సూర్యమండలావిర్భావాన్నిగురించే కాకుండా జగత్తు పుట్టిన కథా, భూగర్భ వైవిధ్యమూవంటి చిరకాలాగత దృశ్యముల వివరణలో కూడా ఈ రెండు రకాలవాదాలూ వస్తూనే ఉన్నాయి భూగర్భ వైవిధ్యమును గురించి సర్ చార్లెస్ లయల్ చేసిన వివరణ పరిణామవాదానికి మంచి ఉదాహరణ.

ముందు భూగర్భ రచనలో హఠాదుద్భవ ఫలితాలని అనుకునేవాటిని చూద్దాము. ఫాసిల్సు అనే గత జీవ శిలావశేషాలున్న పొరలు భూగర్భము పొరపక్కనే గోడలాగా నిటారుగా మళ్లీ పొర ఉంటుంది చిత్రమైన ఖనిజ నిర్మాణమున్న రాళ్లపక్కన పూర్తిగా వేరైన నిర్మాణమున్న రాళ్లు కనబడతాయి. ఒక రకపు జీవ చిహ్నాల పక్కపొరలో వాటితో సంబంధములేని జంతువుల చిహ్నాలు కనబడుతున్నాయి. ఈ విభేదాలు ఎక్కడో ఒకచోట తప్పి జారినట్టుకాక సర్వ సామాన్యముగా కనబడుతూండడముతో ఇది ఏదో పొరపాటుకాక చిర ప్రవర్తమానమైన ఘటనలవల్లనే ఏర్పడిఉండాలి అని అనుకుని, భూమిమీది జంతుసృష్టికీ భూగర్భ విభేదాలకీ కూడా శాంతీ కలతా, శాంతీ మళ్లీ కలతా చెప్పున "యుగాలు"న్నాయన్నారు కొందరు. శాంతి స్థితి చిరకాలము ఉండేదనీ, కలత కొద్దికాలమేవున్నా,దానివల్ల కొత్తపర్వతాలూ, సముద్రాలూ, లోయలూ ఏర్పడి అంతవరకూ ఉండిన జంతుసృష్టిని నశింపజేసి కొత్తరకపు జంతుసృష్టికి దారి చేస్తాయనీ, వూహించారు వారు సర్ ఛార్లెస్ అన్నాడూ, "జీవచిహ్నాల వరసలోనేకాదూ అసలు జీవాల వరసలోనే లింకులు లోపించిపోయాయీ, దీనికి కాలము కొంత సాయపడిందీ, ఉన్నవేనా అన్నీ ఎక్కడ దొరికేయీ, లభ్యమైనవేనా వదింటా తొమ్మిదివంతులు చూడనేలేదూ" అన్నాడు. సజీవ, అజీవ ప్రపంచాలలో నిరంతరాయంగా జరుగుతూండే సామాన్య ప్రకృతిసిద్ధమైన మార్పుల వరసవల్లనే 'కలత'లవల్ల ఏర్పడ్డాయనుకున్న లోపాలన్నీ ఏర్పడతాయని నిరూపించ యత్నించాడు. ఈ యత్నంలో మొదట భూమిమీద పొరలు ఒకచోట అరిగిపోయి, హరించిపోవడమూ ఇంకోచోట కొత్తపొర ఏర్పడడమూ, తరవాత జీవ జంతు సృష్టిలోని ఆందోళనమూ, చివరకి భూగర్భ సంచలనమువల్ల భూమ్యోపరిపొరల వికృతులూ వివరించాడు

భూమి మొత్తపు వైశాల్యాన్ని పరిశీలించినప్పుడు మెట్ట భూములమీదా పాడినేలలమీదా కొత్త పొరపడదనీ, సముద్ర గర్భాలలోనూ, సరోవర గర్భాలలోనూ మట్టీ సున్నమూ ఇసకా రాళ్లూ మడ్డిగా దిగుతాయనీ తెలుస్తుంది. కొన్నిచోట్ల దట్టమైన అరణ్యాలున్నప్పటికీ అక్కడి మట్టి దళస రెక్కక శతాబ్దాల తరబడి ఏ పదంగుళాలలోతే ఉంటుంది ఇలాటి అడవే నీట మునిగితే ఈ శతాబ్దాల వృక్ష జంతు చిహ్నాలు ఆ పొరనుంచి కడుక్కుపోయి మరెక్కడో స్థిరపడవచ్చును. అలాగే సముద్రాంతర భూములలో కూడా ఫాసిల్సు మారుగిళ్లు కావడము జరుగుతుంది. భూమిమీద అన్ని కాలాలలోనూ చెరువులూ, సముద్రాలూ పాడినేలలూ ఉంటూనే ఉండేవి.

ఇక ఈ చెరువులు జరుగుతాయి కూడాను. రోన్‌నది మడ్డి, జెనీవా సరస్సులో పడినట్టేది మైలున్నర జరిగింది, పదో శతాబ్దము తర్వాత. పెద్ద పెద్ద నదులు ఒండ్రుని 'డెల్టాల కడ కూర్చి కూర్చి, అది ఎత్తైపోతే మళ్లిపోయి అసలు సాగర సంగమానికి నూరుమైళ్లదూరాన్న సముద్రంలో పడడమూకద్దు. సముద్రాలలోని నీటి ప్రవాహాలూ మారతాయి. నేల ఒక్కొక్కచోట పైకి లేచిపోతూండడమూ ఇంకొకచోట దిగిపోతూండడముతో కొత్త పొరలు అదివరకు లేనిచోట్ల ఏర్పడడమూ అదివరకు ఏర్పడుతూండినచోట్ల వాయిదా

వడడమూ జరుగుతుంది చీనాబ్‌తెచ్చే మట్టి ఎరుపూ, సట్లెజుది తెలుపూ, సింధునదిది నలుపూను. ఇవన్నీ ఒకమారు ఇక్కడ కొన్ని దశాబ్దాలకు 50 మైళ్ల అవత లానూ. వైవిధ్యముకాక సామరస్యమెక్కడ ఉంటుందీ?

ఇక జీవ జంతువులలో కొన్నిరకాలు· వాటికి కరువు పరిస్థితులు రావడముతో అంతరించి, వాటిస్థానే కొత్తవి ప్రవేశించ డము మామూలే. వెన్నెముకగల జంతువులే 'ఇయాసీను' యుగములోనివి ఈనాడులేవు 'మయోసీను' యుగానికి చెందినవని అను కున్న పొరలలో ఇటీవలి ప్రాణుల చిహ్నాల వంటివి కనబడతాయి. వరసగా పురాతనపు యుగాల (భూమి) పొరలనుంచి ఈ యుగా నికి రావడంలో కొన్ని రకాల ప్రాణులు కనబడవు. కనక వరస పొరలలో జీవ జంతు వుల చిహ్నాలు లోపించి పోవడమన్నది విడ్డూరమేమీకాదు సిసిలీ ద్వీపములోని భూగర్భము పొరలను పరిశీలించిన డాక్టరు ఎ. ఫిలిప్పీ ఈనాటి గుల్లలను పోలినట్టివి నూటికి 13 మాత్రమే ఉన్న పొరనుంచి, నూటికి 95 ఉన్న పొరవరకూ వరాసగా పొరలు దొరికేయి అన్నాడు కలత అన్నదే లేకుండా ఈనాటి గుల్లలు క్రమ పరిణా మమువల్లనే స్థిరపడినందుకు ఇదిసాక్ష్యము కదా?

ఇక భూకంపాలవల్ల కొన్ని దేశాలు కదిలి పోతూండడమూ మరికొన్ని భూకంపమంటే ఏమిటో ఎరక్కపోవడమూ చరిత్ర ప్రసి ద్ధమే కొండలు చీలడమూ, నేలలు కుంగి పోడమూ, లేచిపోడమూ మామూలే. స్వీడను తెలియకుండానే లేచిందీ, గ్రీన్‌లాండు దిగింది. ఎగుడులోని తేడాలవల్లనే స్వీడను తూర్పు తీరానికి పశ్చిమ తీరానికీ తేడాలు కనబడతాయి. పగడపు దీవుల అంచుల రూపము వేలకొలదీ చదరపు మైళ్ల విరివి గల నేలలు క్రమంగా నెమ్మదిగా—ఒక్క మారూ గభీమని దిగిపోకుండా—కిందికి పోడమూ కనబడుతుంది కలత అన్నది లేనే లేని మైదానాలు—అతి ప్రాచీనపు శిలావ శేషాలతో ఉన్నవి—మొత్తంగా వచ్చే కలత అన్నదే లేదని నిరూపించవా?

కనక నెమ్మదిగా భూమి పొరలలోనూ, మృగజాతులలోనూ ఫాసిలు దొర్లాటలు లోనూ జరుగుతూండే పరిణామమే ఒకనాటి బారుదృష్టికి కలతా—శాంతీ వివాద ఫలి తముగా కనబడవచ్చును. వింతేమున్నదీ అంటాడు సర్ ఛార్లెస్ లయల్. మొదట్లో చెప్పినట్లుగా, ఇతనివాదము సహజ పరి ణామమే సృష్టిని నడుపుతూన్నదికాని హఠా ద్ఘటనలు కావని చెపుతుంది. జగత్తు ఏరీతిగా ఆవిర్భవించిందీ? అన్న ప్రశ్నకు కూడా సహజ పరిణామవాదమూ, హఠా ద్విస్ఫోటనవాదమూ అవి రెండు జవాబు లున్నాయి. ●

సీరియల్




## 3

తనకి మంచిరోజు అనేది ఏమైనా ఉంటే అది భర్తకి సంపాదన వచ్చాకనే అని ఎదురు చూస్తుండేది రాధ. చేతిలో డబ్బు లేక ప్రతి పైసకి తండ్రిమీద ఆధారపడి ఉండడం, తల్లీ వాళ్లు తనమీద చెప్పే చాడీలు వీటితో విసిగిపోయి అతనలా ప్రవర్తిస్తున్నాడని సరిపెట్టుకునేది.

సంక్రాంతి పండగకి ప్రయాణం అవుతోంటే "వచ్చేటప్పుడు మీ అమ్మ నడిగి ఓ అయిదు వందలు తీసుకురా నా స్నేహితుడి దగ్గర తీసుకున్నాను ఇంకా ఆలస్యం అయితే బాగుండదు. వాడికిచ్చేయాలి. .."

"అలా ఏడుపుముఖం పెట్టకు. నా సంపాదన చేతికి రాగానే అణాపైసలతో లెఖ్ఖగట్టి మీవాళ్ల డబ్బు వాళ్ల మొఖాన్ని పడేస్తాను. అప్పుగానే ఇమ్మను" అని ఆజ్ఞాపించాడు.

ఆ రౌద్రస్వరూపం కళ్లెత్తి చూసే ధైర్యం కూడ లేక తలొంచుకుని బయటికి వచ్చి బండెక్కింది రాధ. బండిలో కూర్చున్నంతసేపూ రాధ కళ్లలో నుండి కన్నీళ్లు ప్రవహిస్తూనే ఉన్నాయి. "ఏమిటిది ? ఎందుకిలా అడుగడుగునా ఆయనకి లొంగిపోతున్నాను. నాకు ఆత్మగౌరవం ఉంది. వ్యక్తిత్వం ఉంది. చదువు ఉంది. ఆయన కెదురు తిరిగి బ్రతకలేనా ? ఇప్పుడు అమ్మ దగ్గరికి వెళ్లి ఇంక తిరిగిరాకుండా ఎప్పుడూ అక్కడే ఉండిపోతే వీళ్లేం చేయగలరు ?" అనుకుంటూ పరిపరివిధాల ఆలోచించుకుంది.

ఊళ్లో బస్సు దగ్గరికి ప్రకాశం వెళ్లాడు. చెల్లెల్ని చూస్తూనే తెల్లబోయినట్లు కనిపించినా ఆమెని మరేమీ ప్రశ్నించకుండా రిక్షా మాట్లాడి సామాను పెట్టించాడు. వీధిగుమ్మంలో కూతుర్ని చూస్తూనే శాంతమ్మగారు పరుగు పరుగున వచ్చి కౌగలించుకుని,

"అయ్యో తల్లీ ఇదేమిటిలా అయిపోయావు. వాళ్లు నీకు కడుపునిండా తిండి కూడా పెట్టడం లేదేమిటి ?" అంటూ బావురుమంది.

"ఊరుకో అమ్మా తిండిపెట్టక పోవడం ఏమిటి ? అక్కడి నీళ్లు నాకు పడలేదేమో. అయినా అలా ఏడుస్తావేమిటి? నలుగురూ ఏమనుకుంటారు?" అంటూ నెమ్మదిగా చెప్పి లోపలికి తీసుకు వెళ్లింది రాధ.

కొంత స్థిమితపడ్డాక భర్త అడిగిన డబ్బు విషయం చెప్పి, "అమ్మా, అడుగడుగునా ఇలా వందలకి వందలు ఎన్నాళ్లని గుమ్మరిస్తావు ? ఇప్పటిదాకా వాళ్లకిచ్చింది చాలు. ఇంక మరేమీ ఇవ్వకు. ఆ డబ్బు పెట్టి నాకు చదువు చెప్పించు. నేను ఉద్యోగం చేసుకుని నా బ్రతుకు నేను బ్రతుకుతాను. అంతేకాని ఇంక మళ్లీ నేనా యింటికి వెళ్లను" అంది రాధ.

"తప్పమ్మా. అదేమిటి ? డబ్బు అడిగాడని కాపరం కూలదోసుకుంటావా ? ఏదో అవస్థపడి ఉన్నంతలోనే ఇద్దాం మరి. దైవం రక్షించి అతనికా ఉద్యోగం అయినా త్వరగా దొరికితే మనందరి కష్టాలు గట్టెక్కుతాయి తల్లీ. నా పాట్లేవో నేను పడతాను. నువ్వేం బెంగపెట్టుకోకు." అని పైకి కూతురికి ధైర్యం చెప్పింది, తను లోలోపలే బెంగతో కృంగిపోతూ.

పండగ హడావిడి అయిపోయిం తరువాత, ఆవిడ మెడలో గొలుసు తీసి కొడుకు చేతికిచ్చి అమ్మకు రమ్మంది.

"ఇదేమిటమ్మా ?" అన్నాడు ప్రకాశం ఏమీ అర్థం చేసుకోలేక.

"అల్లుడి కెందుకో అయిదు వందలు అప్పుగా కావాలిట. పాపం అతని ఉద్యోగ ప్రయత్నాలింకా కలిసిరాలేదు. తండ్రి నడగడానికి మొహమ్మాట పడినట్లున్నాడు. ఏదో, కానిరోజులొచ్చాయి కనక మనల్ని అడిగాడు గాని మళ్లీ వడ్డీతో సహా తీర్చేస్తానని చెప్పాడుట. అయినా నా బంగారం ఎప్పటికైనా రాధ కిచ్చేదే కదా. ఇప్పుడిస్తే అవసరంలో ఆదుకున్నట్లుంటుంది."

"అమ్మా, నీ బంగారం, పొలం అంతా రాధకిచ్చినా నాకేమీ అభ్యంతరంలేదు కాని నువ్వు అపాత్రదానం చేస్తున్నావనేదే నా బాధంతా. ఆ దౌర్భాగ్యుడు డబ్బు కావలసి వచ్చినప్పుడలా రాధని పుట్టింటికి పంపించి బెదిరిస్తూంటాడు. నువ్వెంతకని ఇవ్వగలవు ? నువ్వు ఇస్తున్నకొద్దీ అడుగుతూనే ఉంటాడు. ఇలాంటివాళ్ల దగ్గర మెత్త మెత్తగా ఉంటే లాభంలేదు. ప్రస్తుతం డబ్బేమీ సర్దుబాటు కాలేదని నేను వ్రాసేస్తాను. చూద్దాం ఏమంటాడో." అన్నాడు ప్రకాశం కోపంతో ఊగిపోతూ.

ప్రక్క గదిలో నుండి వాళ సంభాషణంతా వింటున్న రాధ సిగ్గుతో అవమానంతో దుఃఖంతో కుమిలిపోయింది.

ఆవిడ ఎలాగో బ్రతిమాలి కొడుకుని ఒప్పించింది. ఆ ఏడు పంటమీద వచ్చిన డబ్బులో కూతురికి ఏడాదికి సరిపడే బట్టలు తీసుకుని, ఇంకో యాభై రూపాయలు కూడా చేతిలో పెట్టింది. సిగ్గుతో, బరువెక్కిన హృదయంతో, భర్త అడిగిన డబ్బు తీసుకుని అత్తవారింటికి వెళ్లిపోయింది రాధ.

గదిలో రేడియో లేదు. అది ఏమయిందని రాధ భర్తని అడగలేదు. రాధ

ఇచ్చిన అరువందలు తీసుకొని, "మొత్తానికి నా పరువు నిలబెట్టావు. వెధవ రేడియో పాడయిపోయింది. రిపేరు చెయ్యమంటే వలభై రూపాయలవుతుందన్నాడు. సరే చెయ్యమన్నా. డబ్బులేక అసలా షాపు వేపు వెళ్లలేదు. ఇప్పుడిందులోవి వలభై వాడి మొఖాన్న కొట్టి రేడియో తెస్తాను." అంటూ చిరునవ్వుతో భార్యని దగ్గరకు తీసుకున్నాడు భాస్కరం.

ఆ స్పర్శలో తన అణువణువు ఏవగింపుతో దహించుకుపోగా నిర్లక్ష్యంగా మొఖం తిప్పుకుంది రాధ. అత నదేమీ పట్టించుకున్నట్లు లేదు. హుషారుగా ఈల వేసుకుంటూ గదిలోంచి వెళ్లిపోయాడు.

రోజులు గడుస్తున్నా రేడియో తేలేదు. అది కూడ ఎంతకో అంత కమ్మేసి ఆ ఆ డబ్బు కూడ తగలేశాడని రాధ విశ్వసించుకుంది. చివరికి జరిగింది కూడ అంతే.

మళ్లీ దసరా రోజులు వచ్చేసరికి భాస్కరం ప్రయత్నాలు, రాధ పూజ ఫలించి అతనికి ఉద్యోగం దొరికింది. వీళ అగ్రహారానికి పదిమైళ్ల దూరంలో ఉన్న టౌనులోనే. జీతం నెలకి నూట ఇరవై రూపాయలు. ఇకనైనా తన కష్టాలు గట్టెక్కుతాయని, హాయిగా తామిద్దరూ వేరే ఉంటే ఇంట్లో వేరే ఎలాంటి పోరూ లేక భర్త కూడ తనని ఆదరంగా చూస్తాడని ఆశించింది రాధ. ఎప్పుడు అక్కడికి వెళ్లిపోతామా అని రోజులు లెఖ్కపెట్టడం మొదలుపెట్టింది.

భాస్కరం ఉద్యోగంలో చేరిన రెండు మూడు రోజులకి కాబోలు వాళ అన్నగారు అడిగాడు.

"అయితే అక్కడ ఇల్లు చూసుకుని కాపరం పెడతాతా ఏమిట్రా" అని.

అతను సమాధానం చెప్పేలోగానే దుర్గాంబగారు అందుకుంది. "ఇక్కడ లంకంత ఇల్లు వదులుకుని అక్కడ అద్దె కొంపలో పడిఉండాల్సిన ఖర్మేంరా. ఇంట్లో రెండు గేదెల పాడి, పొలంలో కాసిన కూరగాయలు—ఎంత డబ్బు పోస్తే మాత్రం ఈ సౌకర్యాలెక్కడ్నుంచి వస్తాయి. పది మైళ్లంటే ఏమంత దూరం. ప్రొద్దున్నే భోంచేసి బస్సుకి వెళ్లిపోతాడు. సాయంత్రం భోజనం వేళకి వస్తాడు. ఏమో మరి, మీ ఇష్టం. మరదలు ఇష్టం కాపరం కావాలనుకుంటే తప్ప, ఇక్కడున్న హాయి మరెక్కడా రాదు" అంది.

"నేనూ అలాగే అనుకుంటున్నానమ్మా. మధ్యాహ్నం కాఫీ, టిఫిను ఏ హోటల్లోనో తీసుకుంటూ సాయంత్రానికి వచ్చేస్తూంటాను." అన్నాడు భాస్కరం.

తన జీవితం ఇంక ఇంతేనని నిరాశ చెందుకుంది రాధ.



భాస్కరం ఉద్యోగంలో చేరి పదిహేను రోజులయింది. అప్పటికి దీపావళి పండుగ వారం పదిరోజులుంది.

"దీపావళికి మీవాళ్లింటికి వెడతావా ఏమిటి ?" అన్నాడతను రాధతో ఎంతో ఆప్యాయంగా.

"ఎందుకూ, ఏకంగా సంక్రాంతికే వెడతా."

"అదేమిటి ? దసరాకే మనిద్దరిని రమ్మనమని మీ అన్నయ్య వ్రాశాడుగా. నేను పండగనాటికి వస్తాను. నువ్వు రేపు బయలుదేరి వెళ్లు" అని బలవంతం చేశాడు.

అసలు ఉద్యోగం వచ్చాక అతనిలో కొంత మార్పు వచ్చినట్లనిపించింది రాధకి. చీటికి మాటికి విసుక్కోవడం, తిట్టడం మానేసి భార్య అంటే ఎంతో అభిమానం చూపిస్తున్నాడు. ఏదో అంతమాత్రం మార్పైనా వచ్చినందుకే తనెంతో పొంగిపోయింది. ఒకసారి వెళ్లి తల్లినీ, వాళ్లని చూసిరావాలని తనకే అనిపించింది.

"ఏం, మాట్లాడవు ? బట్టలు అవి సర్దుకుని సిద్ధంగా ఉండు, రేపొద్దునే భోజనం చేసేసి బయలుదేరుదాం. నిన్ను బస్సు ఎక్కించి నేను వెళ్లిపోతా. అమ్మా వాళ్లకి నేను చెప్తాలే." అంటూ మొఖం కడుక్కోడానికి వెళ్లిపోయాడు భాస్కరం.

ఆ రాత్రి అందరి భోజనాలు అయిపోయాయి. పనులన్నీ తెముల్చుకుని వచ్చి బట్టలు సర్దుకోడం మొదలుపెట్టింది రాధ. సాయంత్రం సరికి భర్త మనస్సెలా మారుతుందోనని, పైగా అత్తగారు వాళ్లు ఏమంటారోనని బట్టలు అవీ ఏమీ సర్దుకోలేదు. సాయంత్రం ఆఫీసునుండి వస్తూనే మర్నాటి ప్రయాణం గురించి వాళ్లమ్మతో చెప్పాడు భాస్కరం. ఆవిడా ఒప్పుకుంది. అందుకని ధైర్యంగా, తీరుబడిగా అప్పుడు ప్రయాణ సన్నాహం మొదలుపెట్టింది.

"అబ్బ. ఇప్పుడా ఈపని ? మధ్యాహ్నం అంతా ఏంచేశావు ?" అన్నాడు భాస్కరం మురిపెంగా.












# నిరీక్షణ

"ఎంతసేపు. పది నిముషాల్లో అయిపో తుంది. మీ బట్టలు కూడా ఏమైనా వేయమంటారా. మీరేం తెచ్చుకో అక్కర్లేదు."

"మంచి ఐడియానే. ఎక్కువేం అక్కరేదు. రెండు జతలు వడేయి."

"అవునుగాని, ఇదేమిటో చెప్పుకో" అన్నాడు వో ప్యాకెట్టు చేత్తో పట్టుకుని రాధ ప్రక్కని కూర్చుంటూ.

కొంచెంసేపు ఆలోచించి చివరికి చెప్పుకోలేనని ఒప్పేసుకుంది రాధ. అతనే ప్యాకెట్టు విప్పాడు. రాధ కళ్ళు మిగేలు మన్నాయి బెంగుళూరు సిల్కు చీర, బ్లౌజు పీసు రాధకి పెళ్ళిలో కూడ వాళ్ళు అంత మంచి చీర పెట్టలేదు.

"నీకు నచ్చిందా ? ఇది దీపావళికి నీకు నా ప్రెజెంటేషను. అసలు నేను ఉద్యోగంలో చేరిననాడే ఇవ్వాలనుకున్నాను ఆలశ్యం అయిపోయింది. రాణిగారు క్షమించాలి." అన్నాడు నాటక ఫక్కీలో.

"ఇంత ఖర్చుపెట్టా ! అయినా జీతం అందుకోకుండానే ఎందు కిప్పుడు ?" అంది చిరునవ్వుతో.

"వెధవ డబ్బు. జీతం వస్తేనే కాని, అంత గతిలేకుండా ఉన్నా నేమిటి ? ఎప్పటి పరదా అప్పటిదేనని ఓ ఫ్రెండు దగ్గర తీసుకున్నా. నెమ్మదిగా అప్పులన్నీ తీర్చేయాలి. మీవాళ్ళ కివ్వవలసింది కూడ ఇచ్చేద్దాం. కొంచెం ఆలశ్యమయినా ఏమీ అనుకోవద్దని చెప్పు....

"సరే కాని, నేనో నెల జీతంతో నీకు బహుమతి కొనిచ్చాను. మరి నువ్వు నాకేమిస్తావు ?" అన్నాడు చిన్నపిల్లాడిలా.

ఆ మాటలు వింటూంటే రాధ గుండె పట్టేసినట్లయింది. "ఏదో ఉద్దేశ్యం మనస్సులో పెట్టుకుని ఈ నాటకం ఆడుతున్నమాట ఏదో పెద్ద ఎత్తుమీదే ఉన్నట్లున్నారు. లేకపోతే ఎప్పుడూ లేనిది వారంతట వారు నన్ను పుట్టింటికి పంపిస్తాననడం, అందుకు అత్తగారు కూడ అంగీకరించడం, పెళ్ళయిన రెండున్నర సంవత్సరాల తరువాత వారి చేతుల్లో వారు

లేక కొని వా కివ్వడం—వీటి అంతరార్థం తెలుసుకోలేక నేనే మోసపోయాను. అయినా తెలుసుకుని మాత్రం నేను చేయగలిగిందేముంది ?" అనుకుంది మనస్సులో.

పైకి మాత్రం గంభీరంగా "నేనేం సంపాదించడంలేదుగా మీ కివ్వడానికి. రేపు పండగకి వచ్చినప్పుడు బట్టలు పెట్టిస్తా మా అన్నయ్యచేత." అంది.

"అది నువ్వు పెట్టించే దేమిటి ? వాళ్ళెలాగా ఇస్తారు. నువ్వు మాత్రం నాకో ఉపకారం చేసిపెట్టాలి. రోజూ ప్రొద్దున్నా సాయంత్రం ఈ బస్సుల్లో పడి తిరగలేక పోతున్నా. వో మోటరుసైకిలుంటే వెళ్ళడం రావడం కలిపి అరగంట కూడ పట్టదు హాయిగా, దర్జాగా, వేసుకున్న బట్టలయినా నలగకుండా ఆఫీసు పని చూసుకుని ఇంటికి రావచ్చు. మా ఫ్రెండొకడు అమ్మేద్దా మనుకుంటున్నాడు. మూడు వేల అయిదు వందలు చెప్తున్నాడు. అదెలాగైనా ఇతర్రత్రా పోకుండా తీసుకోవాలనుంది. నాన్నగారి నడిగితే అంత డబ్బివ్వరు. నువ్వెలాగైనా ఏర్పాటు చేశావంటే, నెలనెలా కొంత వెనకేసి మళ్ళీ ఇచ్చేద్దాం. ఇంతెందుకూ నెలకో యాభై నీ చేతికే జమచేస్తూందాం. ఏమంటావు ?"

"అంత డబ్బు మా అన్నయ్య దగ్గర మాత్రం ఎక్కడుంది ? మీకు తెలియ దేముంది. అమ్మ రెండెకరాలు నాకూ అన్నయ్యకీ అని అనుకుంది. దానిమీద అప్పుడే మనకోసం వెయ్యి రూపాయలు పైగా అప్పు చేసింది. బంగారం అమ్మి మొన్న అయిదు వందలు మీకే ఇచ్చింది. ఇంకా ఎక్కడనుంచి తెస్తుంది. ఆవిడ మాత్రం. ఆవిడున్నన్నాళ్ళు కూడ అనుభవించనీయకుండా మనం ఇలా పీడించడం ఏమైనా బాగుంటుందా. నెలకో యాభై వెనకేసుకుని నెమ్మదిగా మనమే కొనుక్కుందాం. ఆవిడ్ని మరి ఇబ్బంది పెట్టకండి" అంది కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా, ఎంతో ప్రాధేయపడుతూ.

"నెలకో యాభై కూడబెట్టి ఎన్నాళ్ళకి కొంటాం. అప్పటికి నేను ముసలివాడిని కూడ అయిపోతా. పొలం మీదయితే అప్పు ఎవరైనా యిస్తారు. పోనీ

అలా తీసుకోమను. ఆ అప్పు తీర్చే భారం నాది. ఇందులో కష్టం ఏముంది. ఇక్కడ పొలం నాపేర లేకపోబట్టి కాని క్షణంలో అప్పు పుట్టేద్దును. అక్కడికే అయిదారు వందల దాకా అయితే మా స్నేహితులే సర్దుబాటు చేస్తారు. కొంచెం పెద్ద మొత్తం కనుక మీముందు చెయ్యి జాచవలసి వస్తోంది. ఎలా వీలవుతుందో నువ్వే ఆలోచించు" అంటూ లేచి వెళ్ళి పడుకున్నాడు.

ఇంక రాధకా రాత్రంతా నిద్దర పట్టలేదు. "ఏమిటీ మనిషి ? అక్క దేమైనా కల్పవృక్షం ఉందనుకుంటున్నారా, అడిగినప్పుడల్లా వందలు, వేలు గుమ్మరించడానికి. నేను మాత్రం వాళ్ళ నేముఖం పెట్టుకుని అడుగుతాను. ఛీ. ఏందుకొచ్చిన బ్రతుకు. నాకు సుఖంలేదు. నావల్ల ఇంకొకరికీ సుఖంలేదు" అనుకుంటూ తెల్లవార్లూ లోలోపలే కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

ఇలా అడుగడుక్కీ అత్తవారిని పీడించి డబ్బు తీసుకోమని ఎవరైనా అతనికి చెప్పి పెడుతున్నా రేమోననే సందేహం కూడా వచ్చింది నోసారి. "ఒకళ్ళు చెప్పే దేమిటి ? డబ్బు పాడుచెయ్యడం, చెడు సహవాసాలు పట్టి తిరగడం ఆయనకి ముందునుండే ఉన్నదేగా. ఏటొచ్చీ అప్పుడు డబ్బుకోసం తల్లినీ, తండ్రినీ పీడించే వారు. ఇప్పుడది మామీదకి తిరిగింది. ఇక వాళ్ళ నడగడం మానేశారు కదా అని మా అత్తగారు వాళ్ళు కాస్త హాయిగా వూపిరి పీల్చుకుంటున్నారు" అని మళ్ళీ తనకి తనే సమాధానం చెప్పుకుంది.

రాత్రంతా ఎంతగా ఎన్నివిధాల ఆలోచించి బాధపడినా తెల్లవారేసరికి రాధ ఆలోచన లన్నీ ఒక్క దగ్గరే కేంద్రీకృత మయ్యాయి, తల్లిని అంత మొత్తం ఎలా అడగడం. ఆమెకి మాత్రం ఎక్కడినుండి వస్తుంది. అన్నదే సమస్య.

రిక్షా దిగి ఇంట్లోకి వస్తున్న చెల్లెల్ని చూసి ప్రకాశం అభిమానంగా పలకరించాడు.

"అదేమిటమ్మా. ఉత్తరం అయినా వ్రాయకుండా వచ్చావు. బావగారికి మామీద దయ కలిగినట్లుంది. ఎంతో బ్రతిమాలించుకుంటేనే గాని నిన్ను పంపించనివారు, ఏదో మాటవరసకి వ్రాసిన ఉత్తరానికే పంపించేశారు." అంటూ లోపలికి తీసుకు వెళ్ళాడు.

"ఒక్కదానివే వచ్చావా అమ్మా. అల్లుడు రాలేదా ?" అంటూ తడి చెయ్యి కొంగుని తుడుచుకుంటూ వంటింట్లోంచి వచ్చింది శాంతమ్మగారు.

"వారు పండగనాటికి వస్తానన్నారు." అంది. రాధ బిస్కట్ల పొట్లం మేనల్లుడి చేతిలో పెడుతూ.

"ఉద్యోగపు వూళ్ళో కొత్త కాపరం ఎప్పుడు పెడతారు?" అంటూ కామాక్షి పలకరించింది.

"ప్రస్తుతం దాని సంగతేమీ అనుకోవడంలేదు. పది మైళ్ళేగా. అరగంటకు గంటకీ బస్సు లున్నాయి. అలాగే వెళ్ళి వస్తున్నారు రోజూ." అని. వాళ్ళింకేమీ ప్రశ్నలు వెయ్యడానికి అవకాశం ఇవ్వకుండా పెరట్లోకి వెళ్ళిపోయింది. కాళ్ళు కడుక్కోడానికి "స్నానం చేసేయమ్మా. వంటయి పోయింది. ఏకంగా అందరికీ వడ్డించేస్తాను." అంది శాంతమ్మగారు.

"నా స్నానం, భోజనం అన్నీ అయిపోయాయి. ఇవాళే మిటి యింత ఆలశ్యం అయింది? అన్నయ్య స్కూలుకి వెళ్ళడా" అంది వంటింట్లో పీట వాల్చుకు కూర్చుంటూ.

"ఇవాళ వాళ్ళ కెందుకో శలవట. ఎక్కడికో వెళ్ళి తిరిగి తిరిగి యిప్పుడే వచ్చాడు. హడావిడి లేదుకదా అని నేను కాస్త ఆలశ్యంగా మడికట్టుకున్నాను."

మధ్యాహ్నం అంతా తీరుబడిగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు తనకి భర్త కొనిచ్చిన చీర చూపించింది రాధ. అందరూ కూడ బాగుందని మెచ్చుకున్నారు.

"ఏదో నమ్మా. నీకు మంచిరోజు లొచ్చాయి. మీ ఆయన సంపాదనపరుడయ్యాడు. మీరు సుఖంగా కాపరాలు చేసుకుంటూంటే నేను నిశ్చింతగా కళ్ళు మూయగలను. నా కింకే కోరికా లేదు." అంది శాంతమ్మగారు. ఆమె కనుకొలకులతో రెండు ఆనందభాష్పాలు నిలిచాయి.

"లేదమ్మా లేదు. నేను సుఖంగా లేను. నా హృదయంలో అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుతున్నాయి. నాలో అణువణువూ అవమానంతో ఆవేదనతో దహించుకుపోతోంది" అని చెప్పేసి తల్లి ఒడిలో తల పెట్టుకుని తనివిదీరా ఏడవాలనే కోరికని అతి



# నిరీక్షణ

ప్రయత్నంమీద అణుచుకుంది. తన కళ్లల్లో తిరుగుతున్న కన్నీరు ఎవరి కంటా పడ కుండా ఉండడానికి, చీర పెట్టెలో పెట్టే నెపంతో గదిలోకి వెళ్లిపోయింది.

పండగ రేపనగా ఆ సాయంత్రానికే వచ్చాడు భాస్కరం. తెల్లవారగట్ల తలంట్లు, పిండివంటలతో పండగ భోజనం అన్నీ యథావిధిగా సరదాగానే జరిగాయి. బావ మరిది తెచ్చిన సాదా బట్టలే సంతోషంగా కట్టుకున్నా డతను. భర్త ప్రతిచర్యకి నిర్వ చనం తెలిపిన రాధ అంతరంగం మాత్రం క్రోధాసహ్యాలతో ఉడికిపోయింది.

"ఇంకా ఇలాగే ఉన్నావేం. పట్టుచీర కట్టుకో మరి. మీవాళ్లకి చూపించావా ?" అన్నాడు కొత్త పంచె అంచులు సరిచేసు కుంటూ.

అది కట్టుకుని తల్లి కాళ్లకి దణ్ణం పెట్టింది రాధ.

"పది కాలాలపాటు సుఖంగా వర్ధిల్లు తల్లీ" అంటూ ఆశీర్వదించి, "అన్నయ్యకీ, వదినకీ కూడా నమస్కారం చెయ్యమ్మా" అందావిడ.

ఆ రాత్రి టపాకాయల హడావిడితో సరదాగానే గడిచిపోయింది.

"రాధ నింకొక నెళ్లాళ్లుంచుకొని పంపి స్తామని" అంతకుముందే ప్రకాశం అడిగి ఉండడం చేత, భాస్కరం ఒక్కడే ఆ తెల్ల వారుజామున ప్రయాణం పెట్టుకున్నాడు.

"ప్రయాణం అయి వెళ్లేముందు, మీ వాళ్లకి చెప్పావా నే నడిగింది." అన్నాడు మెల్లిగా భార్యతో.

"ఇంకా లేదు."

"ఇంకా ఎన్నేళ్లు కావాలేమిటి ? మీ అన్నయ్య నిన్నింకో నెళ్లాళ్లుంచు కుంటా నన్నాడు. అప్పటికైనా ఆ డబ్బు చేతితో వేసుకురావాలి నువ్వు."

"అంత డబ్బు అడిగితే వాళ్లేమను కుంటారు. నా కేమిటో సిగ్గేస్తోంది. పోనీ ఇంకెక్కడైనా అప్పు తెచ్చుకుందాం." అంది జాలి కలిగేలా భర్త కళ్లల్లోకి చూస్తూ.

కాని అతని మనస్సు కరగలేదు. అయితే నేను చెప్పిందంతా గంగలో కలిసి పోయిందన్నమాట. నాకు అప్పు ఎవడిస్తాడు. మీ అమ్మ పొలం తాకట్టుపెట్టి డబ్బు తెప్పించమను. నేనా అప్పు నెమ్మదిగా తీరుస్తా. ఎవడో ముక్కు మొఖం తెలి యనివాడి దగ్గర మాట్లాడినట్లు అంత నిర్మోహమాటంగా చెప్తావేం. ఆ డబ్బు పట్టుకుని నేనేం పారిపోతానా. నువ్వీ ఏర్పా టేదో వెంటనే చేసి నాకు ఉత్తరం వ్రాయి." అన్నాడు కటువుగా.

ఆ కంఠంలోని కాఠిన్యానికి బెదిరి పోతూ తల వంచేసుకుంది రాధ మరేమీ సమాధానం చెప్పకుండా.

నెల రోజులు గడిచిపోయాయి. డబ్బు విషయం తల్లితో ఏమీ చెప్పలేదు రాధ. కాని, కూతురెలాగో ఉంటోందనీ, ఆమెలో ఉత్సాహం అనేది బొత్తిగా లేదనీ, దేన్ని గురించో బాధపడుతూందని గ్రహించింది శాంతమ్మగారు. అదేమిటో చెప్పమని అస్తమానూ అడుగుతూండేది.

"ఏం లేదమ్మా" అని తప్పించు కుంటూండేది రాధ.

"వేరే కాపరం పెట్టలేదని బాధపడు తున్నా వేమిటమ్మా ? కొన్నాళ్లపాటు పెద్ద వాళ్ల దగ్గరుండటం కూడా మంచిదేలే. ఏదో అతను కాస్త మారాడు. నిన్ను అభిమానంగా చూసుకుంటున్నాడు. అదే పదివేలనుకోమ్మా." అని నచ్చచెప్తూం డేది ఆవిడ.

"నాకేం బాధ లేదమ్మా. నువ్వేమిటి ఇలా పట్టుకున్నావు." అని తల్లిమీదే విసుక్కుంటూండేది రాధ.

ఓ మధ్యాహ్నం భాస్కరం దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. పెళ్లయిన దాదాపు మూడు సంవత్సరాలకి అతను భార్యకి వ్రాసిన మొదటి ఉత్తరం. అదే, భర్త నుండి ఆమె అందుకున్న చివరి ఉత్తరం కూడ.

"డబ్బు విషయం ఏమయిందో నువ్వేమీ వ్రాయలేదు. ఎలాగూ ఓ నెల గడిచిపోయింది అని ఇక్కడికి వచ్చేద్దా మనుకుంటున్నా వేమో. అదేం కుదరదు. ఇంకొన్ని రోజులు

ఆలశ్యమయినా సరే, నువ్వు అదేదో తేల్చుకునే ఇక్కడికి రావాలి వాళ్లకేవో యిబ్బందులున్నాయని, వాళ్లేమయినా అనుకుంటారనీ భయపడి నువ్వు అడగలేకపోయానని చెప్తే లాభంలేదు. డబ్బు సమకూర్చుకునేదాకా నువ్వక్కడుండవలసిందే. ఇన్నిమాటలెందుకు ? నా మోటారు సైకిలుకి కావలసిన డబ్బు చేత్తో పట్టుకునే నువ్వు మా గడప తొక్కగలవు." ఇదీ ఆ ఉత్తరం సారాంశం.

అది చూసుకుంటూనే పరిసరాలనే విస్మరించి వెక్కివెక్కి ఏడ్చింది రాధ.

ఏడుపు వింటూనే తల్లీ వదినగారూ పరుగెత్తుకొచ్చారు. "ఏం జరిగిందమ్మా. అక్కడంతా కులాసాగా ఉన్నారా ? నువ్విక్కడ ఎక్కువ రోజులుండిపోయావని అతనికోపం వచ్చిందా ? చెప్పు తల్లీ." అంది శాంతమ్మగారు కూతుర్ని దగ్గరకు తీసుకుని కన్నీళ్ళు ఒత్తుతూ.

"ఏంలేదమ్మా. అంత చెప్పుకోవలసింది కూడ కాదు." అంది అప్పటికి దుఃఖం దిగ మింగుకోగలిగిన రాధ నిర్లిప్తంగా

"ఓహో. నేను వినకూడని రహస్యం కాబోలు." అనుకుంటూ వెళ్లిపోయింది కావమ్మ.

తరువాత తల్లి ఎంతోసేపు బతిమిలాడగా సంగతంతా చెప్పి, "నువ్వు వాళ్లకి డబ్బు ఇవ్వవద్దమ్మా. ఇచ్చినకొద్దీ అడుగుతూనే ఉంటారు. మనుష్యుల తత్వాలు తెలిసింతర్వాత వాళ్ళు మారతారనుకోవడం తెలివితక్కువతనం,

నేను స్కూలు ఫైనల్ ప్యాసయ్యాను కదా. ఏదైనా ఉద్యోగం చేసుకుంటూ నా కాళ్లమీద నేను నిలబడ్డమే సరైన మార్గం. ఇంక నేనా నరకంలోకి వెళ్ల దలచుకోలేదు " అని తన నిశ్చయం తెలియజేసింది రాధ.

ఆవిడ నెత్తి మొత్తుకుంటూ "ఇదేం ప్రారబ్ధమే తల్లీ. నెమ్మదిగా అతనికేదో నచ్చచెప్పాలి కాని, కాపరమే అఖ్ఖర్లేదంటే ఎలా ? అన్నయ్యకి చెప్తానుండు మీ ఆయన్నీ, మామగారినీ కలుసుకుని సంగతి సందర్భాలన్నీ చెప్పి చూస్తాను.

ఇది మనస్సులో పెట్టుకునేనామ్మా, వచ్చినప్పటినుండీ అలా కుమిలిపోతున్నావు. మీ రిద్దరూ ఏదో కీచులాడుకున్నారేమో అనుకున్నాను కాని, ఇలాంటి పేచీ పెడతాడని నే నూహించలేకపోయాను. లేచి మొఖం కడుక్కో. నెమ్మదిగా అన్ని సంగతులూ ఆలోచించుకుందాం.

"ఇప్పుడా ఉత్తరానికి నువ్వేదయినా జవాబు వ్రాయవద్దా మరి?" అంది.

"నేనీ ఉత్తరానికి జవాబు వ్రాయను, ఆ యింటికి వెళ్లి కాపరమూ చెయ్యను. నన్ను విసిగించకు. నిజంగా నా సుఖం కోరే దానివయితే నా బ్రతుకు నన్ను బ్రతకనీ." అని తల్లినే కసురుకుంది రాధ.

ఆవిడ మరేమీ మాట్లాడలేదు నాలుగైదు రోజులు గడిచిపోయాయి. అన్ని సంగతులూ ఆవిడ కొడుకుతో చెప్పింది. అతను చెల్లెలి మామగారిని కలుసుకొస్తానని వెళ్లాడు.

ఆయనసలు మాట్లాడ్డానికే అవకాశం యివ్వకుండా "ఆ విషయంలో కలుగజేసుకోడానికి వాడేం చంటిపిల్లాడు కాదు. ఇవన్నీ నువ్వు మీ బావమరిదితోటే మాట్లాడి పరిష్కారం చేసుకో." అని తప్పుకున్నాడు తెలివిగా.

ప్రకాశం భాస్కరాన్ని కూడ కలుసుకున్నాడు.

"నేనేం వూరికే అడగలేదు. అప్పుగా ఇవ్వడానిక్కూడా మీకింత బాధెందుకు ? మీరు పైవాళ్ల కిచ్చే వడ్డీ కూడా నా దగ్గరే వసూలు చేసుకుందురుగాని. మీకు మాత్రం ఏ పదిమంది ఉన్నారని. ఒక్కగా నొక్క చెల్లెలు. అల్లుడు ముచ్చటపడి అడిగినందుకైనా ఇవ్వొచ్చు. దానికింత రాద్ధాంతం చేస్తారా ? ఏదో సమయానికి చేతిలో లేక మిమ్మల్నడిగితే నలుగురిలో నా పరువు కూడ తీసేశారు." అంటూ ఎగిరెగిరి పడ్డాడు అతను.

ప్రకాశం ఇంకా ఏదో చెప్పబోతే వినకుండా గదిలోకి వెళ్లిపోయి తలుపులు వేసేసుకున్నాడు. కాస్సేపు కూర్చుని చేసేదిలేక ఇంటికి వచ్చేశాడు ప్రకాశం. ఆయింట్లో ఒక్కరూ కూడ అతన్ని భోజనం చెయ్యమని అనలేదు. కనీసం మంచినీళ్లు కూడ ఇవ్వలేదు.

(సశేషం)



# నాన్నారు ఎప్పుడొస్తారు?

సి. కనకాంబర రాజు

"అమ్మా, నాన్నారు ఎప్పుడొస్తారమ్మా?"

"ఇవ్వాళే...., సాయంత్రానికల్లా వచ్చేస్తారు. నీకు పూర్ణించి మిఠాయిలు, పుస్తకాలు, బొమ్మలు...."

"రైలుబండి, లక్కపిడతలు అన్నీ తెస్తారు కదూ ? ఫో అమ్మా ..., నువ్వేమీ చెప్పక్కర్లేదు. నాన్నగారేం యివ్వాళ రారు. నాకు అవన్నీ తేనూ తేరు. రోజూ నువ్వు ఇలానే చెబుతుంటావ్. అయినా ఒక్కరోజూ కూడా నీమాట నిజంకాలేదు. నువ్వు వట్టి అబద్ధాలమ్మవు. అంతా అబద్ధం. నీ మాటలన్నీ అబద్ధం. నాన్నారు రారు. నిజం చెప్పమ్మా. రారు కదూ ...?"

నాలుగో యేడు ప్రవేశిస్తున్న చిన్నారి పాపాయి 'సుమ' పదే పదే అడిగే యిలాంటి ప్రశ్నకు 'సుందరి' ఏం సమాధానం చెప్పగల్గుతుంది ? ఏమీ చెప్పలేదు నోటితో ఏమీ చెప్పలేదు. నిజాన్ని వప్పేసుకున్నట్టుగా కంట తడి పెడుతుంది. కాగా, తన బంగారు తల్లి సుమను హృదయానికి హత్తుకొని, ఆ హాయిలో అనిర్వచనీయమైన ఆనందాన్ని త్రుటికాలం అనుభవిస్తుంది. ఆ తృప్తితోనే ఆమె జీవితం నెట్టుబడుతోంది.

సుమ అడిగిందానికి సమాధానంగా తోచినది చెప్పడం, ఆశ చూపించడం, మభ్య పెట్టడం. ఇలా వూహ తెలిసినప్పటి నుంచి సుమ అడుగుతోనే ఉంది. సుందరి చెబుతూనే ఉంది.

సుందరి హృదయాలింగనంలోంచి తెప్పరిల్లింది సుమ.

"అమ్మా, చెప్పమ్మా నాన్నారు ఎప్పుడొస్తారు ?"

పాప ఏమరలేదు. మళ్లీ గుర్తు తెచ్చుకుని అదే ప్రశ్న అడుగుతోంది.

"చూడమ్మా, డబ్బాలో చాక్లెట్లున్నాయి. అందులో మూడో నాలుగో నువు తీసుకుని నాకోటి తెచ్చిపెట్టు."

"అక్కర్లే నాకు చాక్లెట్లు. అవి వద్దంటే నువ్విస్తాననే డబ్బులు కూడా నా కొద్దు. నాకేమీ వద్దు. నాకు నాన్నగారు కావాలి. నువ్వసలు మంచిదానివి కాదు. నాన్నారు వచ్చిం తర్వాత— నీవని చెబుతా నుండు. నాన్నా, నాన్నా .... అమ్మ వట్టి అబద్ధాలకోరు. అన్నీ అబద్ధాలే చెబుతుంది. మనం అమ్మతో 'కట్టి' చేద్దాం. అస్సలు మాట్టాడనే వద్దు. అని చెప్పేస్తా...."

"అలానేలేమ్మా ..., అలానే చెబుదూ గాని. నువ్వు లే ..., లేచి బెబ్బేసుకుని అన్నం తిందువుగాని రా. ఆకలవడం లేదూ ....?"

"నాకేం ఆకలవడంలేదు. ఇవ్వాళ నాన్నారిని చూడకుండా అసలు నేనేమీ ముట్టేదే లేదు. నీకైతే మా నాన్నారు లేకపోయినా ఫరవాలేదు. నీ కున్నారు గనక. అప్పుడప్పుడు వస్తుంటారు గనుక. నీకేం ఎంచక్కా ఉండొచ్చు. మరి నేనలా కాదే .? నాకూ మా నాన్నారు కూడా కనిపిస్తూ ఉంటే నేనూ నీలాగే ఉందును."

వయస్సుకు తగని తెలివితో మాట్లాడే పాపనే చూస్తోంది సుందరి పాపకు ఎన్నో ప్రశ్నలు. అన్ని ప్రశ్నలు తండ్రిని గురించే. సుమ పితృప్రేమకు నిరుత్తరురాలై పోతోంది.

అమ్మ స్థితి పాపకు తెలియదు. అక్కరలేదు కూడాను. తన మాటలు అమ్మను బాధిస్తున్నాయి, తన ప్రశ్నలు శూలాలు దిగేస్తున్నాయి అని పాపకు తెలియదు పాపకు కావాల్సింది నాన్న. ఆ నాన్న కనిపించేవరకు, అతని ఆదరణ పొందే వరకు పాప యిలానే వేధిస్తూంది.

పాపను తండ్రి ఆలననుంచి తప్పిద్దామని అనేకవిధాల ప్రయత్నిస్తుంది సుందరి

ఇలా ఎన్నో రోజులు గడిచిపోయినయ్. అయినా పాప ప్రశ్నకు సమాధానం లేదు అమ్మ యిచ్చే సమాధానమే ఉంది గాని, బుజావర్తనమైన సమాధానం లేదు. దాని కోసమే తపించి పోతోంది పాప.

సుమ రానురాను అమ్మ మాటల్లో నమ్మకాన్ని కోల్పోతోంది. అమ్మమీద కోపగించుకుంటూ ఉంది కూడాను.

సుమ ఈరోజు సుందరిని విడిచి పెట్టేలా లేదు.

"చూడమ్మా పాపా, అదిగో సంధ్య పిలుస్తున్నట్టుంది. ఆడుకోడానికి రమ్మంటోంది. వెళమ్మా."

"ఏం పిలవడంలేదు. పిలిచినా వెళ్లేది లేదు. మా 'నాన్నారిని చూశాక ఆడుకోడానికి వస్తాను ఫో' అనేస్తాను.

"తప్పమ్మా .., స్నేహితురాళ్ళని అలా గసురుకోవచ్చా ? ఎంచక్కా కలసి మెలసి ఆడుకోవాలి. తెలిసిందా ? వెళ్ళు వాళ్లింట్లో రైలుబండి ఉంది కదూ ?"

"ఉండమ్మా నువ్వు మరీని. వీళ్ళసలు మంచోళ్లు కాదమ్మా, మొన్న సరూ ఏమందో తెలుసా? సుమకు అమ్మే గాని నాన్న లేరే అంది. అని అందరితోనూ చెబుతోంది. అపుడేమో నే ననాను, ఫోవే మా నాన్నారు వూరెళ్లారు. ఇవ్వాళ సాయంత్రం వస్తారు. మా అమ్మ చెప్పింది. అన్నాను.వాళ్లు వాళ్లు ఒకటే నవ్వులూ, వేళాకోళాలూను. నువ్వు చెప్పిన మాటలు నేనే కాదమ్మా, వాళ్లు కూడా నమ్మరు మా అమ్మ అబద్ధం చెప్పదు పొండి అన్నాను వాళ్లు వింటేనా ? 'నీ కసలు నాన్న లేరు ఉంటే చూపించు' అంటూ ఒకటే గోల. నేను కోపగించుకుని వచ్చేస్తుంటే నా వెనక్కాల పడ్డారమ్మా. పిళ్ల నసలు దగ్గరకు రానీయకూడదు. వాళ్లు మంచివాళ్ళు కాదు. కదమ్మా ., చెప్పమ్మా. ..., ఎందుకమ్మా నాన్నారి గురించి అడిగినప్పుడల్లా నీ కళ్ళల్లో నీళ్లొస్తాయి ? ఏడిస్తేనే కదమ్మా కళ్లల్లో నీళ్లొస్తాయి ? నువ్వు ఏడుస్తున్నావా అమ్మా నువ్వెందు కేడవాలమ్మా ? నాన్నారు ఇవ్వాళ వస్తారని నువ్వే కదా చెప్పావు ఇంక ఏడుపెందుకమ్మా ? నేను అల్లరి చేస్తున్నానని కోప మొచ్చిందా ? నేను అల్లరిచేస్తూ ఉంటాను—, చెప్పిన మాట వినను అని సరూ వాళ్ళమ్మలాగ నాన్నారితో చెబుతావా ? చెబుతావా అమ్మా ? చెప్పకమ్మా ? నాన్నారు నన్ను కోప్పడుతారు.

కోప్పడి నన్నసలు దగ్గిరికే రానివ్వరు. నాన్నారేమో రాకరాక ఎన్నాళ్ళికో వస్తున్నా రాయె. వచ్చి రాగానే నువ్వేమో పాప అల్లరి చేస్తోంది అని చెప్పేస్తావు కాబోలు ! అమ్మ బాబో, అయితే నాన్నారు నన్ను ఎత్తుకోరు సంధ్యా వాళ్ల నాన్నా రిలా ముద్దెట్టుకోరు మా అమ్మకదూ.... నువ్వు నాన్నారితో చెప్పకమ్మా.. ., చెప్పవు కదూ , మాట్లాడవేమమ్మా.... చెప్పవు కదూ . . వూ....?"

తల్లి గడ్డం పట్టుకుంది సుమ బ్రతిమ లాడుతున్నట్టు.

"పాపా..." అంటూ సుమను గట్టిగా గుండెలకు హత్తుకొని తన ఉద్వేగాన్ని, పరితాపాన్ని పాప పసిగట్టకుండా గుండె ల్లోనే ఏడ్చుకుంది అమ్మ.

"అమ్మా.... మరే .... మరే .... నాన్న గారు ఏవూరమ్మా వెళ్ళ ?"

పాపకు ప్రశ్నలు తప్పితే పరిస్థితి అర్థంకాదు.

సుందరి మాట్లాళ్లేదు. మాట్లాళ్లేక పోయింది.

"మాట్లాడవేమమ్మా...., నువ్వు నాతో మాట్లాడవా....? నాన్నారు వచ్చేదాకానన్నా మాట్లాడమ్మా. ఆ తర్వాత మానే ద్దువులే. ఇప్పుడే మానేస్తే యిక నాతో మాట్లాడేవా రెవరుంటా రింక ?"

"మాట్లాడతానమ్మా .... మాట్లాడ తాను. చెప్పు. ఏమిటన్నావు ?" ఆవేదన్ని దిగమింగింది సుందరి.

"నీ కంట్లో ఏదన్నా పడిందామ్మా ఎన్నెన్ని నీళ్లొస్తున్నాయో చూడు."

చిట్టి చిట్టి చేతులతో తల్లి కన్నీళ్ళు తుడిచింది సుమ.

పాపను మరల్చాలని_వృధా ప్రయాస పడుతోంది సుందరి. పాపను మరల్చగల శక్తిని, ధైర్యాన్ని యిమ్మని లోలోన భగవం తుడ్ని వేడుకొంటూ ఉంది.

"ఏమ్మా ... నాన్నారు ఏవూరెళ్ళారు? నాకోసం కాదమ్మా. అందరూ అడుగు తున్నారు పిల్లలే కాదమ్మా, పెద్దవాళ్ళు కూడాను ఈ బామ్మల కసలు బుద్ధుండ దమ్మా. వాళ్ళు మరీను. నేనేమో చిన్న పిల్లనా, పెద్ద పెద్ద మాటలు నాకేం తెలుస్తాయి చెప్పమ్మా. మొన్నటికి మొన్న ఎదురింటి బామ్మగారు అంది ., పాపా మీ నాన్నగారు ఎప్పుడొస్తారు అని. నే నన్నాను ఇవ్వాళ వస్తారు అని. అప్పుడేమో ఎక్కడి కెళ్లారు అని, ఎందు కెళ్లారు అంటూ ఎన్నడిగిందని ? నే ననేశాను. బామ్మగారూ, మీకు బుద్ధిలేదూ అని. నాకు బలే కోపమొచ్చింది లేమ్మా మరి. బుద్ధి లేకపోవడమంటే విషయాలు తెలియక పోవడమని నువ్వు చెప్పావుగా. అందుకే అలా అనేశాను. 'బామ్మగారూ మీకు బుద్ధిలేదూ ...., నేనేమో చిన్నపిల్లను. నాకు చిన్న తలకాయ ఉంది. ఇంకా బళ్ళోకన్నా వెళ్లలేదు. మీరు నాకంటే ఎంతో పెద్దోళ్ళు గనుక మీకే ముందు తెలిసి ఉండాల్సింది. మా నాన్నారు ఎక్కడి కెళ్లారు, ఎందు కెళ్లారు—ఇవి తెలియక పోతే మీ కసలు బుద్ధి లేదన్నమాటే' అన్నాను. ఆవిడ నన్ను తిట్టిందమ్మా. 'రాలుగాయిపిల్లా, ఉండు మీ అమ్మతో



చెబుతా నుండు. ముదనష్టపుదానా' అంటూ తిట్టిందమ్మా. నేనన్న దానిలో తప్పేం ఉందమ్మా ? బామ్మగారి కంటే నేనే నయమమ్మా. యింకా నేను బుద్ధున్నదాన్నవ్వాలంటే అన్నీ తెలుసుకోవాలి. కదమ్మా.... నాన్నారు ఎక్కడి కెళ్ళారు...., ఎందు కెళ్ళారు...."

ఎక్కడినుంచి వస్తున్నాయో యీ మాటలన్నీ గుక్కతిప్పకుండా మాట్లాడేస్తోంది సుమ.

ఇది చిన్నపిల్లేనా ? ఇంతింత తెలివితేటలు దీని కెలా వచ్చాయి అని అలానే పాపాయిని కనురెప్పలు మూయకుండా చూస్తూ ఉంది సుందరి.

అమ్మ పరధ్యాన్నంగా ఉన్నట్టు గ్రహించి కదిలించింది సుమ.

"చెప్పమ్మా...నాన్నారు ఎక్కడికెళ్ళారు?"

ఏదో చెప్పాలి తప్పదు.

"హైదరాబాదమ్మా."

"హై ద రా బా ద మ్మా, ఎ క్క డ ఉందమ్మా ?"

"హైదరాబాదమ్మా కాదు. హైదరాబాదు."

# నాన్నారు...

"హుఁ .... అదేలే. అదెక్కడ ఉంది ? బామ్మలాంటివాళ్ళు ఇలానే అడుగుతారమ్మా. ఆమాత్రం కూడా తెలియదేమో వాళ్ళకి? హయిదరాబాదు ఎక్కడుంటుంది? హయిదరాబాదులోనే ఉంటుంది. ఇదే తెలియదు వాళ్ళకు."

చిన్నారి చేతులతో అభినయిస్తోంది సుమ.

"అవునమ్మా, నిజమే. వాళ్ళకేం తెలియదు."

"నాన్నారు అక్కడి కెందు కెళ్ళారమ్మా ?

" . . . . . . "

"చెప్పమ్మా....."

"నాన్నారూ .... నాన్నారు ... హైద్రాబాదు.... ఎందు కెళ్ళారంటే...., ఆఁ.... నీకు మిఠాయిలు తెద్దామని."

"పోమ్మా.. .., నువ్వూ బామ్మలాంటి దానివే. ఎక్కడైనా మిఠాయిలు కోసం హైదరాబాదు వెళ్తారేంటి ?"

"ఏమో మరి .... ఏమో .... నాతో అలా చెప్పారు. మన బంగారు తల్లికి యిక్కడి మిఠాయిలు తినిపించకూడదు, హైద్రాబాదు నుంచి పట్టుకురావాలి అని చెప్పి అక్కడికి వెళ్ళారు."

"అవునమ్మా...., నేనంటే నాన్నారికి అంత యిష్టమా ? అలాగని నీకు ఉత్తరాల్లో రాస్తున్నారా అమ్మా ...? ఏమ్మా నాన్నారు ఎప్పుడొస్తారు ? వచ్చి రాంగానే నేను చెప్పేస్తాను —నాన్నారూ నాకు మిఠాయిలు కోసం మీరు హయిదరాబాదు వెళ్ళకండి, నాకు మిఠాయిలు వద్దు, ఏమీ వద్దు. మీరు ఇంటి దగ్గరే ఉండండి. నేను మీతో ఆడుకుంటాను. అని చెప్పేస్తాను."

"సరే అలాగే చెబుదూగాని. లే అన్నం తిందువుగాని."

"వద్దమ్మా నాకసలు ఆకలే లేదుగా. ఏమిటోగాని నాన్నారి గురించి మాట్లాడుకుంటే నాకసలు ఆకలే వేయదమ్మా. నీకూ అంతే కదమ్మా. మీనాన్నారు వస్తే నువ్వూ అన్నం తినవు కదూ.....?"

"అవును."

"చూడమ్మా...., పక్కింటి విశాల లేదూ...అదే.. మొన్న నా రిబ్బను ఎత్తుకుపోయిందే అది. అదేమో వాళ్ళ నాన్నగారి నెపుడూ తిడుతూ వుంటుంది. మా అందరితో వాళ్ళ నాన్నారి మీద నేరాలు చెబుతూ వుంటుంది, వాళ్ళ నాన్నారు ఏం మంచివారు కాదట. సినిమాలకు తీసుకువెళ్ళరట.. మిఠాయిలు తెచ్చి పెట్టరంట. 'చెప్పమ్మా... మిఠాయిలు తెచ్చి పెట్టకపోతే నాన్నారు మంచివారు కాపోతారా? ఛీ .విశాల మంచిది కాదు కదమ్మా. ..?"

"అవునమ్మా....అవును."

"అదేంటమ్మా.. పిన్నిగారు బాబాయిగారితో ఎప్పుడూ తగువులాడుతూ వుంటుంది. నువ్వూ నాన్నారితో పేచీ పెట్టుకుంటావా అమ్మా...? కాదుకదూ. మా అమ్మ చాలామంచిది. మా నాన్నారితో అస్సలు పోట్లాడనే పోట్లాడదు. కదమ్మా."

సుందరి మొహాన్ని చేతులతో రాస్తూ అంది సుమ.

సుందరి ఏం మాట్లాడదు వింటుంది. అంతే

"పరూ...వాళ్ళ నాన్నను చూశావు



కదమ్మా. సాయంత్రం యింటికి వస్తా రంట...వచ్చీరాంగానే వాళ్ళమ్మను పట్టుకుని కొడతారంట. తిడతారంటమ్మా. మన నాన్నారు కూడా అలానే చేస్తారామ్మా...? కాదు కదమ్మా...నాన్నారు విన్నేమీ అనరు కదూ...? నవ్వుతూ మాట్లాడుతూ... వుంటారు కదూ.?"

"సంధ్య చెప్పిందమ్మా...వాళ్ల నాన్నారు వాళ్లమ్మను ఏమీ అనరట. అసలు ఆయనకు కోపమే రాదట. వాళ్లమ్మ ఏమడిగినా తెచ్చిస్తారట. సంధ్యకు కూడా—అరవై. మొన్న సంధ్యేమో కీయిచ్చే ఆడుకునే రైలు కావాలంది. అంతే సాయంత్రాని కల్లా తెచ్చిపెట్టారు. ఆ రైలు ఎంత బావుందను కున్నావమ్మా...? రెండు పట్టాలుంటాయి

# నాన్నారు...

తాని మీద రైలు పరుగెడుతూ పోతుంది. ఆ రైలు అలా పరుగెడుతూ వుంటే సంధ్య 'కూ' అని కూత పెడుతుంది. భలే సరదాగా వుంటుంది లేమ్మా. నాన్నారితో చెప్పి నాక్కూడా అలాంటిది తెప్పించుకుంటాను. తెచ్చిస్తారు కదమ్మా. నువ్వు కూడా చెబుతావు కదమ్మా. అమ్మా...మరే....మరి నాన్నారు ఇవ్వాళ రాకపోతే మనమే హైదరాబాదు వెళ్ళిపోతే? అమ్మా వెళ్దామామ్మా...?

చీర చెంగుతో కళ్ళు తుడుచుకుంది సుందరి.

"అదేంటమ్మా..నీ చీర చిరిగిపోయింది, వుండు, నాన్నారు రానియ్. నీకో వంద చీరలు, నాకో ముప్ఫైఏడు గౌనులు తెప్పిస్తాను. సరేనామ్మా..., నువ్వింక చిరిగిపోయిన చీరలు కట్టుకోవక్కర్లేదు, నేనూ సంధ్యలాగా రోజుకో గౌను వేసుకోవచ్చు."

"అలానే లేమ్మా......."

"అమ్మా, నాన్నారు రావడం చూసి నాకు చెప్పమ్మా..., నేను దాక్కుంటాను. అప్పుడు నాన్నారు వచ్చేస్తారు. వచ్చేసి, ఏదీ, మన పాపేదీ అని అడుగుతారు. నువ్వు పాప వచ్చి పోయిందీ....."

"పాపా..." కౌగిలించి గట్టిగా బంధించింది. పాప నోటిని చేత్తో మూస్తూ సుందరి.

"వెళ్ళమ్మా వెళ్ళు. సంధ్యా వాళ్ళింటికి వెళ్ళి రైలుతో ఆడుకో, వెళ్ళు." అంది.

"రైలుతో ఆడుకోవడం నాకూ ఇష్టమేనమ్మా..., కాని, వాళ్ళమ్మ నన్ను అడుగుతుందమ్మా. నిన్న మా నాన్నారు వస్తారు అని చెప్పేశాను. నాన్నారు రానే లేదుగా. ఇవ్వాళ అడిగితే ఏమని చెప్పాలి? అందుకని..."

"పోనీలే నువ్వు ఎక్కడికీ వెళ్ళొద్దు. మనం యివ్వాళ అలా గార్డెనుకు వెళ్దాం. నువ్వు తొందరగా అన్నం తినెయ్. రా అన్నం పెడతాను."

"వద్దమ్మా మనం గార్డెనుకు వెళ్ళొద్దు. మనం గార్డెనుకు వెళ్ళిన తర్వాత నాన్నారు వచ్చి మళ్ళీ వెళ్ళిపోతారు? అందుకే మనం ఎక్కడికీ వెళ్ళనే వద్దు. ఇక్కడే వుందాం."

"నువ్వు అన్నం తినరాదా..., అన్నం తినకపోతే నీకు ఆకలేస్తుంది. [illegible] సన్నంగా రామ్మూర్తిగారి 'మీనా'లా అయిపోతావు. అప్పుడు నాన్నారు వచ్చి ఇదేమిటి మన పాప యిలా అయిపోయిందేమిటి? నువ్వు అన్నం పెట్టడంలేదా, అని నన్ను తిడతారు. కోపం వచ్చేస్తుంది నాన్నారికి...."

"వద్దమ్మా వద్దు. నాన్నారికి కోపం రప్పించకూడదు. అన్నం కలిపి తీసుకురా. ఇక్కడే తింటాను."

"హమ్మయ్యా." అనుకుంటూ సుందరి అన్నం కలిపి తీసుకు వచ్చి ఒక్కొ్కముద్దనే తినిపిస్తోంది.

"అమ్మా..." పాప సంశయం సుందరికి తెలుసు. అందుకే అన్నం ముద్ద సుమ నోటికి అడ్డంపెట్టింది.

"అన్నం తినేప్పుడు మాట్లాడ కూడదమ్మా. అన్నం తినెయ్. తర్వాత మాట్లాడుదువుగాని....."

"పోమ్మా...., నువ్వెప్పుడూ అంతే. అన్నం అన్నమే. మాటలు మాటలే."

"అలా అనకూడదమ్మా...., నాన్నారికి కోపం వస్తుంది."

"ఏంరాదు పో. నాన్నారి గురించి మాట్లాడుకుంటే నాన్నారు ఏమీ అనరు. అది సరే.., మరి నాన్నారు ఎక్కడ అన్నం తింటారు?"

"హోటల్లో."

"హోటల్లో వాళ్ళమ్ముందా?"

"ఛ..., వాళ్ళమ్మ హోటల్లో ఎందుకు వుంటుంది?"

"మరి అమ్మే కదమ్మా అన్నం పెట్టేది?"

"సంధ్యా వాళ్ళ నాన్నగార్కి, ఆనాన్నగారి అమ్మ అన్నం పెడుతుందా ఏం?"

"సంధ్యా వాళ్ళమ్మ పెడుతుంది. అయితే నాన్నారికి నువు అన్నం పెట్టాలి. నువ్వేమో యిక్కడే వున్నావమ్మే. ఇంక నాన్నారు అన్నం తినేది ఎలా?"

"నాకు తెలియదులేమ్మా... నీకు నేను సమాధానం చెప్పలేను. నాన్నారు వచ్చిన తర్వాత ఆయన్నే అడుగు. ఆయనే చెబుతారు."

"అయితే సరే..., ఇంకొద్దమ్మా, ఆకలిగా లేదు......"

"ఒక్కముద్ద తినమ్మా..., లేకపోతే ఆకలేస్తుంది. తినమ్మా...నా బంగారు కొండ కదూ.....!"

"వద్దమ్మా...వద్దు. నువ్వు చేతులు కడుక్కుని రా. నాన్నారి సంగతులు చెప్పుకుందాం. సంధ్యా వాళ్ళమ్మా యిద్దరు ఇంచక్కా చెప్పుకుంటారమ్మా. వాళ్ళ నాన్నారు పొద్దున్నే ఎక్కడికో వెళ్ళిపోతార్ట, మళ్ళీ సాయంత్రం వచ్చేదాకా ఒకటే కబుర్లనుకో. నేనూ అక్కడే కూర్చుని వింటూ వుంటాను. నాకు తెలుసునో లేదో, సంధ్యా వాళ్ళ నాన్నారు సాయంత్రం వచ్చీరాంగానే సంధ్యను ఎత్తుకుని ఎన్ని ముద్దులు పెట్టుకుంటారనుకున్నావ్..., నన్నూ దగ్గరికి రమ్మంటారు. నాకు భలే సిగ్గేస్తుంది. పరుగెట్టుకొచ్చేస్తాను."

"అమ్మా, పాపా నువు అన్నం తిన్నావుగా అలా పోయి ఆడుకు రా. నాకు నిద్రొస్తోంది. వెళ్ళమ్మా సంధ్యా వాళ్ళింటికెళ్ళి వాళ్ళ నాన్నారి కబుర్లు విను."

"వద్దమ్మా ఇవ్వాళ నేనెక్కడికీ వెళ్ళను. నువ్వు నిద్రపోవద్దు. నాన్నగారేమో కాస్సేపటికో కూస్సేపటికో వచ్చేస్తారు, నువ్వు నిద్రపోతావా? భలే మంచిదానివేనే.. వుండు, వీధిలో కెళ్ళి నాన్నారు వస్తున్నారేమో చూసొస్తాను."

పరుగెత్తుకెళ్ళి, చేతిలో ఒక కవరుతో తిరిగి వచ్చింది సుమ.

కవరు తల్లి చేతికిచ్చి,

"బళ్ళో పిలక మాస్టారు ఇచ్చారమ్మా" అంది.

"తప్పమ్మా ఆయన్ను అలా పిలవకూడదు. ఆయన మన పోస్టు మాస్టారు."

"ఏమిటది....? పోగను ... ఏమిటోలే. అంతంత మాటలు నాకెలా వస్తాయి? ఉత్తరం ఎవరు వ్రాశారమ్మా.. నాన్నారేనా?"

"అవును."

"ఏమని వ్రాశారు? ఇవ్వాళ సాయంత్రం వస్తున్నాను, ఎక్కడికీ వెళ్ళొద్దు, యింటి దగ్గరే వుండండి, వంద చీరలు, ఢెబ్భైయి గౌనులు తెస్తున్నాను అని వ్రాశారా?

**ఏమమ్మా...?**

"అవునమ్మా అవును. అన్నీ తెస్తారుట. కాని, ఇవ్వాళ రావడంలేదట. రేపు వస్తారట."

"........................."

"పాపా, రేపు వస్తారటమ్మా...."

"అ..యి..తే..ఇవ్వాళ రా...రా...? నన్ను వచ్చీరాంగానే ఎత్తుకోరా?"

ఎలా సమాధాన పరచాలో తెలియక తిక మక పడిపోతోంది సుందరి.

తనకు ఇంత తెలివైన కూతురు నెందు కివ్వాలి? అని దేవుడి నడుగుతోంది.

సుమ తన తల్లిని యిలా అడగడం కొత్తకాదు. ఇలా వేధించడం, వేపుకు తినడం ఇదే ప్రథమంకాదు. ప్రశ్నల వర్షానికి అలవాటై తడుస్తున్న తల్లి నిత్యం అనుభవించే మనోవ్యథ పాపకు తెలియదు. పాపం తండ్రంటే పడిచస్తుంది. తండ్రి ఆదరణ ఎలా వుంటుందో ఎరుగదు. అందు కనే పొరుగిళ్లకు పోయి సహజసిద్ధమైన వికసిత జ్ఞానంతో పసిగట్టి, తాను కూడా అటువంటి అనుభూతుల్ని పొందగలిగితే ఎంత ఆనందంగా వుంటుంది? అలానే వూహించుకుంటూ తల్లి దగ్గరికి వచ్చి చూపించింది చిన్నదీ అంతా ఏకరువు పెడు తుంది. విషాన్ని మింగిన ఆతల్లి చిరు చేదుల్ని రుచి చూడ్డంతో ఏమంత కలత పొందదు. అలవాటైపోయింది. అందు కనే, కూతురు ప్రశ్నలకు సాధ్యమైనంత దగ్గరలో నమ్మేట్టు కల్పించి సమాధానం చెబుతూ వుంటుంది. సుమ సామాన్య మైంది కాదు. చాల అసాధ్యురాలు. ఇట్టే పసి గట్టేస్తుంది.

తనకూ సుమలాంటి కోర్కెలు వున్నాయి. తనూ తన భర్త కోసం ఎదురు చూస్తూ వుంటుంది. ఎదురు చూడ్డం అనవసరం అని బాగా తెలుసు. అయినా ఏదో ఆశ. అలానే కాలం గడుపుతోంది. కనీసం సుమ ఐనా సంతోషపడుతుందని తాను నిగ్ర హించు కొంటోంది. బాధను మింగుతోంది. అగ్నిని జీర్ణం చేసుకుంటోంది.

సుమను తండ్రి ధ్యానం నుంచి తప్పిద్దా మని శతవిధాలా ప్రయత్నిస్తోంది. కాని

**ఏం ప్రయోజనం?**

పిల్లలు తల్లిదండ్రుల ప్రేమను ఆశించడంలో తప్పేమీ లేదు. దూరంగా వుంటు న్నప్పుడు ఆ ప్రేమ మరింత బలంగా ఏర్పడు తుంది.

సుందరికి ఒకటే బాధ. తన కూతుర్ని తన ప్రాణానికి ప్రాణమైన బంగారుతల్లి, ఇలా తండ్రి కోసం తపించిపోతోంది కదా, ముమ్ముందు ఎలాంటి దారుణం జరుగు తోందని భయపడిపోతోంది. రానురాను తండ్రి పైన అలవ సుమకు ఎక్కువవు తుందేగాని తాను ఆశించినట్టు ఏమాత్రం తరగడంలేదు.

ఉత్తరాలు తండ్రి దగ్గరి నుంచి వస్తు న్నట్టు తానే వ్రాసి పోస్టు చేస్తూ వుం టుంది. సుమను నమ్మిద్దామనే ప్రయత్నం ఇది. ఇలా ఎంతకాలం? ఒకోసారి అను కుంటుంది సుందరి—తాను సుమకు అనర్థ మైన ఆశలు కల్పించానని. కాని, ఆ ఆశ లేకపోతే సుమ కోసం తను బ్రతకలేదు. కల్పనాప్రపంచమే తనకు ప్రోత్సాహమిస్తూ వుంది.

"అమ్మా మరి నాన్నారి పేరేమిటమ్మా.?"

ఎప్పుడూ అడగని ప్రశ్న—

"నాన్నారే..."

"అది కాదమ్మా నాన్నారు సరే..., అసలు పేరు. నన్ను సుమా అని అప్పుడప్పుడు నువు పిలుస్తుంటావే...అలాంటిది నాన్నా రికి లేదా?"

అనామకుడు కాదు తన భర్త. అందుకే యీసారి అబద్ధం చెప్పలేకపోయింది.

"ఏం పేరమ్మా... చెప్పవూ?"

తను భర్త పేరు చెప్పకూడదు అని పాపకు తెలియదు. తెలియజెప్పినా వినదు. అందుకే చెప్పేసింది.




**సత్యకీర్తి.**

"సత్యకీర్తి భలే పేరు." భలే పేరు సత్యకీర్తి మానాన్నరి పేరు." అంట గెంతింది ఆనందంతో సుమ.

"అమ్మా....మరే...."

"చూడమ్మా తల్లీ...నేను చెప్పినట్లు వింటావా అల్లరి చేస్తావా?"

"నేను అల్లరి చేస్తానా అమ్మా....?" ఉత్సాహం పోగొట్టుకుని బిక్కుబిక్కు మంటూ చూస్తోంది సుమ.

సుమ అల్లరి చెయ్యదని సుందరికి తెలుసు.

"అది కాదమ్మా, చూడు నీకో మంచి కథ చెప్పనా....?"

నాన్నగారి మాటల నుంచి తప్పించడానికి అంతకన్నా వేరు మార్గం దొరకలేదు.

ఇష్టం లేకపోయినా, అమ్మ చెప్పే కథలు బావుంటాయి గనక అయిష్టంగానే ఒప్పు కుంది సుమ.

ఈ ఆలోచన ముందుగానే రానందుకు తన్ను తాను తిట్టుకుని, ఇప్పటికైనా వచ్చి నందుకు, కలుగజేసినందుకు భగవంతునికి ధన్యవాదాలర్పిస్తూ మొదలెట్టింది సుందరి.

"—ఒక మహారాజు గారున్నారు. ఆ మహారాజుగారికో అమ్మాయి వుంది. అచ్చు అందాల బొమ్మ. నీఅంత అందమైంది. చక్కనైందీను. రాజుగారు కూతుర్ని ఎంతో గారాబంగా పెంచుకుంటున్నారు. మరెవరూ సంతానం లేదు గనక కంటికి రెప్పలా కాపాడుకొంటూ వున్నారు. ఇలాగే ఆ రాకుమార్తె ఆడింది ఆట. పాడింది పాట. ఎప్పుడూ ఎంతో ఆనందంగా వుం డేది. రాకుమార్తె చాలా దయగలది. ఎవ్వళ్లన్నా బాధ పడుతుంటే చూసి ఓర్పుతో లేకపోయేది. వెంటనే వాళ్లకు తగిన సహాయాలు చేసి సంతోషపెట్టి పంపిస్తూ వుండేది."

"నువ్వు మొన్న బుద్ధుడి కథ చెప్పావే... అందులో బుద్ధుడి లాగన్నమాట...."

"అవును. అచ్చం అలానే. కొంతం నిజం. అయితే, ఆ అమ్మాయికి కూడా చదువు కావాలిగా మరి..., అంచేత రాజుగారు ఒక గురువుగార్ని పెట్టారు. ఆ గురువుగారి

దగ్గర చదువుకుంటున్న మరో రాజకుమారుడు ఈ రాకుమార్తెను చూసి ప్రేమించాడు."

"అంటే.."

"తర్వాత చెప్తాను. ముందు కథ విను. ఆ....అప్పుడు ఇద్దరూ పెళ్లి చేసుకోవాలి అనుకున్నారు. అందుకు మహారాజుగారు ఒప్పుకోలేదు. రాకుమారు డన్నాడూ 'మనం వేరే రాజ్యం పోయి అక్కడ పెళ్లి చేసేసుకుందాం, మన బ్రతుకు మనం బ్రతుకుదాం' అన్నాడు. రాకుమార్తె అతడ్ని విడచి వుండలేకపోయింది. అందుకు సరే అంది. ఇద్దరూ మరో దేశం వెళ్లి అక్కడ పెళ్లి చేసేసుకున్నారు."

"భలే భలే.....!"

"అలా కొంతకాలం వున్నారు. ఎంతో హాయిగా వున్నారు. ఉద్యోగం చేసుకోవాలి అనుకున్నాడు రాకుమారుడు. ఆదేశం అప్పుడు చాలా అల్లకల్లోలంగా వుండేది. ఇతర రాజ్యాల వాళ్లు వచ్చి ఆ రాజ్యాన్ని దోచుకుందామని చూస్తూ వుండేవారు."

"చైనా వాళ్లలా కదమ్మా...."

"ఊఁ...అలానే..., అది చూచి రాకుమారుడు సహించలేకపోయాడు. దేశరక్షణ కోసం శత్రువులతో పోరాటానికి వెళ్లాడు."

"మరి రాకుమార్తె ఒప్పుకుందామ్మా"

"రాకుమార్తె స్వయంగా అతన్ని తిలకం దిద్ది పంపించింది. పాపం ఆ సమయంలో ఆమె గర్భవతి కూడాను. అతను సైన్యంలో చేరి పోరాటం సాగిస్తున్న కాలంలో రాకుమార్తెకు పండంటి ఓ చక్కని కూతురు కల్గింది."

సుమను మరింత దగ్గరగా అదుముకుంది సుందరి.

"ఊఁ.....అప్పుడేమైంది?"

"ఈ విషయం రాకుమారుడికి తెలియజేస్తే ఎంతో సంతోషించాడు, తాను వెంటనే ఆ పాపాయిని చూడ్డానికి వస్తున్నానని టెలిగ్రాం యిచ్చాడు."

"అప్పుడు కూడా టెలిగ్రాంలున్నాయమ్మా..."

పొరపాటును గ్రహించింది సుందరి.

"అబ్బే అవార్త పావురం కాలుకి కట్టి

# నాన్నారు..

పంపాడు. రాకుమార్తె అతని కోసం ఎదురు చూడసాగింది. ఇప్పుడొస్తాడు, మరి కాస్సేపటి కొస్తాడు అని ఎదురు తెన్నులు చూస్తు వుంది. అలా కనిపెట్టుకుని వున్న ఆమెకు పిడుగులాంటి వార్త చెవిని పడింది. రాకుమారుడు ప్రయాణించే విమానం కూలిపోయిందట."

"విమానాలున్నాయా....?"

ఏం చెప్పాలో తెలియక "వున్నాయి" అంది సుందరి. దుఃఖం ముంచుకొస్తూ వుంది.

"రాకుమార్తె గుండె పగిలిపోయింది. ఆమె తండ్రి సంగతిని విని చూడ్డానికి వచ్చాడు. తన యింటికి తిరిగి రమ్మన్నాడు. మానుషవతియైన ఆ రాకుమార్తె రానూ' అంది. అయినా తండ్రి వస్తూపోతూనే వున్నాడు. బాగోగులు చూస్తూనే వున్నాడు. మనుమరాలితో ఆడుకుంటూనే వుంటాడు.

"తాతయ్యలా. కదమ్మా..."

"అవును. అయితే పాపాయి మాత్రం చాలా అల్లరిపిల్ల. తండ్రి గురించి రాకుమార్తెను ఎప్పుడూ అడుగుతూ వుంటుంది. తల్లి ఏదో సర్ది చెబుతూ వుంటుంది. కాని, ఆ పాపాయి నీలాగ చాల గడసరి. తల్లి మాటలు నమ్మదు. అన్నమావం నీ వడిగివ వచ్చే నాన్నెప్పుడొస్తారు? అంటూ తల్లిని అదే పనిగా అడుగుతూ వుంటుంది. తల్లి మాత్రం లోపల్లోపలే ఏడ్చుకుంటూ కుమిలిపోతూ కూతురుకు తెలియకుండా చాటుగా గట్టిగా ఏడుస్తూ వుండేది. ఆ పాపాయి తండ్రిని గురించే ఎప్పుడూ అడుగుతూ ఆతల్లి బాధను మరింత ఎక్కువ చేస్తూ వుండేది."

"అమ్మా నేనైతే ఏంచేస్తానో తెలుసా?"

సుందరి కళ్లు మెరిశాయి.

"ఆ...ఏం చేస్తావు?"

"అమ్మను ఓ ఒదారుస్తాను." అమ్మా, నాన్న పోతేపోయాడులే. నేనున్నాను కదా. నేను పెద్దయ్యాక, ఇప్పుడు నువు నన్ను ఎలా చూస్తున్నావో నిన్ను కూడా నేను అలాగే చూస్తాను. నీకెప్పుడూ బాధ

కల్గించను....."

సుందరి ఆనందానికి అవధుల్లేవు. సుమను ముద్దుల్లో ముంచెత్తింది.

"అవున్మా రాకుమారుడు చచ్చిపోయాడంటావా?"

"నువ్వేమంటావు?"

"నాకైతే రాకుమారుడు చచ్చిపోయి వుండడనే అనిపిస్తోంది. ఎందుకంటే చచ్చిపోయిన రాకుమారుడ్ని రాకుమార్తె చూడలేదుగా మరి...., విమానం ఎక్కడో కూలిపోయి వుంటుంది. కొండల్లోనో అడవుల్లనూ తిరిగితిరిగి యింటి కొచ్చేస్తాడు. అప్పుడు పాపను చూస్తాడు. అంతే కదమ్మా......"

సుందరి ఎడమకన్నదరింది శుభశూచకంగా.

"నిజమామ్మా......నిజంగా వస్తారంటావా? నిజంగా యింటికి వస్తారంటావా? మా నాన్న......" తన్ను తాను సంబాళించుకుంది. ఆఖరిమాట మింగేసింది.

బిత్తరపోయింది సుమ.

"అది కథ కదమ్మా. పూర్వకాలంలో వచ్చేసివుంటాడు. ఇప్పుడు వాళ్లంతా చచ్చిపోయివుంటారు కూడా."

వింతగా కన్పించిన తల్లిని పరిశీలించి చూసి, ఏదో ఆలోచించింది. అంతలో సుధ అక్కడికి వచ్చింది.

"సుధ వచ్చిందమ్మా నేను ఆడుకోడానికి వెళ్లనా?"

ఇంతవరకు సుమ తన్ను విడిచివెళ్తేనే మంచిదనుకున్న సుందరి యిప్పుడు సుమ తన్ను విడచి వెళ్లేందుకు ఇష్టపడలేదు.

"వద్దమ్మా, ఇక్కడే కూర్చో, మీ నాన్నగారు వస్తారుగా."

"పో అమ్మా నువ్వెప్పుడూ అంతే. నేను యిప్పుడే వచ్చేస్తానుగా. ఈ లోపు నాన్నారువస్తే వచ్చిరాంగానే నన్ను పిలువ్వు. పరుగెత్తుకొస్తాను" అంటూ తుర్రుమ పారిపోయింది సుమ.

తలగడలో తలదూర్చి దుఃఖభారం తొలగిపోయేవరకూ ఏడ్చింది సుందరి.

ఆ రాత్రి సుమ నిద్రలో కలవరింతలు

పెట్టడం మొదలెట్టింది—

"నాన్నారు చచ్చిపోయారా అమ్మా, నిజమేనా? నాకెందుకు అబద్ధం చెప్పావు? పోనీలేమ్మా నే నున్నానుగా ఇప్పుడు నువ్వ న్నిలా చూస్తున్నావో ..... నీ యంతయ్యాక......"

భయాందోళనతో పిచ్చిదానిలా ఐపోయింది సుందరి.

సుమవంటిమీద చెయ్యివేస్తే చెయ్యి కాలిపోతోంది. జ్వరం తీవ్రంగావుంది. పిలిచేందుకు డాక్టరు కూడా దగ్గర్లో లేడు. అలానే చెంతను కూర్చుని తడిగుడ్డతో ఉపశమనాన్ని కలుగజేస్తూ కళ్లల్లో వత్తులు పెట్టుకు చూస్తూవుంది.

సుమ ఉలిక్కిపడుతోంది. కలవరిస్తోంది.

సుందరి తన ఏడ్పును ఆపుకోలేక అవుకుంటూ సుమ పసిగట్టకుండా జాగ్రత్త పడుతూవుంది. తెల్లవారుజామువరకూ గడిచింది.

వీధి తలుపు చప్పుడైంది.

మొదటిసారి వినిపించకపోయినా, రెండవ సారి పిలుపుతో తేరుకుని వెళ్లి తలుపు తీసింది.

ఎదురుగా నిలబడివున్న అతడ్ని దీపం వెల్తురులో పోల్చుకుని దిగ్భ్రాంతి చెందింది సుందరి.

"మీరు..... మీరు..... ."

"అవును సుందా నేనే......నేను బ్రతికే ఉన్నాను. ఏమిటలా చూస్తావ్.....? పాప ఏదీ? చూశావా? విమానం కూలిపోయింది మాదికాదు. మేమున్న విమానం శత్రువుల చేజిక్కింది యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డాం నీ మంగళసూత్రం ఎంత గట్టిదో చూడు. మన ప్రేమ ఎంత దృఢమైందో చూడు .... చచ్చి బ్రతికాను. అది సరే, తర్వాత మాట్లాడుకోవచ్చు. పాప ఏదీ. ముందు పాపను చూడాలి. చూపించు."

నిర్ఘాంతపోయి, అచేతనురాలైన సుందరిని సత్యకీర్తి కుదించేవరకు తెలివిలోకి రాలేదు.

వెంటనే భర్తను తీసుకుని పాప దగ్గరకు పరుగెత్తింది.

పాప మగతనిద్రలోవుంది. జ్వరతీవ్రతతో మొహం ఎంతో కళా విహీనంగావుంది.

"పాపా, నాన్నారు వచ్చారమ్మా...నాన్నారు వచ్చారు. నువ్వు చెప్పావుగా నాన్నారు వస్తారని.... .అలానే వచ్చేశారు. చూశావా. ..నీ పల్కులు ఎంత నిజమైనాయో .. నువ్వు దేవతవుసుమా... .. నువ్వు దేవతవు."

పాపను నో కుదిపేస్తూ, వూగించేస్తూ తన్ను తాను మరచిపోయి సుమను అదేపనిగా ముద్దుపెట్టుకుంటూ అమితోత్సాహంతో మాట్లాడేస్తోంది సుందరి.

సుమ కళ్లు విప్పింది. నాన్నగారిని చూసింది. నవ్వింది. మళ్లీ కళ్లు మూసేసుకుంది.

"నాతో అబద్ధం ఎందుకు చెప్పావమ్మా. నాన్నారు చచ్చిపోయారా.. ..ఇంక రారా..... నన్ను ఎత్తుకోరా. ..పోనీలేమ్మా నీకు నేనున్నానుగా... .."

అయోమయంగా చూస్తున్నాడు సత్యకీర్తి. అతనికేమీ అర్థంకాలేదు.

"నేను...మీ నాన్నను వచ్చానమ్మా" అన్నాడు.

సుమకు ఆ మాటలు వినిపించాయో లేదో......?

"నాన్నారు ఎప్పుడొస్తారమ్మా.....?"

ఆఖరిసారిగా అడుగుతూ పాప మరియిక మాట్లాడ్లేదు.

నాన్నను గుర్తుచేసి అమ్మను ఇంకెప్పుడూ బాధపెట్టకూడదు అనుకుందో ఏమో......దూరంగా అందకుండా ఎవరికీ చెందకుండా వెళ్లిపోయింది.

"నాన్నారు వచ్చారమ్మా......" అన్న సుందరి పిచ్చికేకకు ప్రతిధ్వనిమాత్రమే సమాధానంగా వచ్చింది. ●

సీరియల్

# కరుణ






కొండముది శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు కరుణ—ప్రసన్నలకు వివాహ మవుతుంది. మన్మథ కూడా పై చదువులు చదవటానికి విశ్వ ఉంచుకుంటాడు. కరుణ, మన్మథ, వీరభద్రం ఎం. ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్తారు. ప్రసన్న ఉద్యోగ ప్రయత్నం సఫలమవుతుంది. పెద వారి పట్టిన వీరభద్రాన్నివార్చటానికి మన్మథ చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. తన ప్రయత్నాన్ని విఫలంచేసిన మన్మథపై ప్రతీకారాన్ని తీర్చుకోడానికి సింహాద్రి అవకాశం కోసం ఎదురు చూస్తుంటాడు.

పరిస్థితుల ప్రభావానికి లోనై నాటకంలో మన్మథతో నటించడానికి ఒప్పుకున్న కరుణకు ప్రసన్న వాల్తేరు వస్తున్నట్లు రాసిన ఉత్తరం కలవరపాటును కలిగిస్తుంది.

## 24

మర్నాటి ప్రొద్దుటికి గాని ఆమె ఒక నిర్ణయానికి రాలేకపోయింది. వచ్చిం తర్వాత ఆమె ఒక్క క్షణం కూడా తన గదిలో కూచోలేకపోయింది. అంతవరకూ వచ్చి మంచినీళ్లు ముట్టలేదు. సబిత బ్రతిమలాడి, ఆమె గొంతు బొంగురుపోయింది.

క్లాసులోకి ప్రవేశించబోతున్నాడు మన్మథ. అది ప్రొఫెసరు నీలకంఠంగారి క్లాసు. షేక్స్‌పియర్ మీద ఆయన పాఠం విని తీరాలి. అందులోనూ ఒథెల్లో. అమాయకురాలైన డెస్డిమోనాను ఒథెల్లో చంపివేసే ఘట్టం ఆరోజు పాఠం. విద్యార్థులందరూ, ఓ పది నిముషాలు ముందుగానే వచ్చి చాతకాల్లా ఆచార్యులవారి కోసం ఎదురుచూడసాగారు. డెస్డిమోనా అనుమానానికి బలైపోయింది. షేక్స్‌పియర్ ఒక్కొక్క నాటకంలో ఒక్కొక్క దుర్లక్షణాన్ని, మానవ బలహీనతను పతాకస్థాయికి తీసుకువచ్చి, తద్వారా పాత్రల మనోవైకల్య స్థితిని హృద్యంగా, రమణీయంగా, దయనీయంగా చిత్రిస్తాడు. నీలకంఠంగారి కంఠంలో, షేక్స్‌పియర్ శైలీ వైభవమంతా వినబడుతుంది. అంచేతనే అంతవరకూ తన వెనుకనే వచ్చిన కరుణను చూడకుండా ముందు చూస్తూ, మన్మథ క్లాసులోకి వెళుతున్నాడు.

"బావగారూ ! జస్ట్ ఎ మినిట్ !" మన్మథ కళ్లెం వేసినట్టు ఆగిపోయాడు.

"అట్లా తోటలోకి వెళ్దాం రండి, మాట్లాడుకొందాం. చాలా అవసరమైన విషయం." మన్మథ కరుణ కళ్ళనంక చూశాడు. బరువుగా, ఎర్రగా, నిద్రలేమితనాన్ని, హృదయభారాన్నీ తెలియజేస్తున్నాయి. మన్మథ ఒక్క క్షణం ఆలోచించి, "పదండి" అంటూ పుస్తకాలు తీసుకుని ఆమెను అనుసరించాడు. ఎండ కరకరమంటూ పైకి ప్రాకుతోంది. కాల్టెక్స్ కంపెనీ ఆఫీసర్ల క్వార్టర్స్, అగ్గిపెట్టెల్లా కన్పిస్తున్నాయి. వైస్—ఛాన్సలర్‌గారి ఇంటిప్రక్కనే ఉన్న జీడిమామిడి తోటలోకి వెళ్లారు రోడ్డు మీద పోతున్న మనుషులూ, కార్లూ కన్పిస్తున్నా, శబ్దం వినపడనంత దూరములో కూచున్నారు. అక్కడ నుంచి చూస్తుంటే, సముద్రమంతా ఒక పెద్ద నీలిమబ్బులా కనిపిస్తున్నది. నీటిపై తేలుతున్న పడవలు వ్యక్తిత్వంలేని పరాధీనుల్లా ఉన్నాయి.

"ఏమిటి నీ సందేహం ?" మన్మథ కూచుంటూ అడిగాడు.

"ఏం లేదు. ఈనాటకం మంచికి రాలేదనిదని నా అనుమానం! నేను ఇందులో వేషం వెయ్యలేను. నన్ను క్షమించు, మరొకర్ని ఎవర్నయినా తీసుకోండి."

"ఈమాట చెప్పడానికి ఇంతవరకు రానక్కర్లేదు కరుణా ! ఇంతకన్నా ముఖ్యమైంది మరొకటి ఉన్నది. ఏమిటది?"

కరుణ చెట్టునున్న జీడిమామిడిపండు తెంపింది. దాన్ని చేతుల్లో పెట్టుకుని ఆడిస్తూ "ఏ ప్రక్కన నేను నటించలేను." అన్నది చిట్టచివ్వరకు.

మన్మథ మొహం కళావిహీనమైంది. "అంటే ?" అన్నాడు ఆ వాక్యం వెనకల ఉన్న అర్థాన్ని పూర్తిగా గ్రహించటానికి ప్రయత్నిస్తూ "అంటే?—నామీదే నీకు సందేహమా ?"

కరుణ పేలవంగా నవ్వింది. "ఈత చెట్టు క్రింద నుంచుని నేను పాలు తాగుతున్నానంటే ఎవరూ నమ్మరు బావా! ఇతరులు మనను అనుమానిస్తున్నారే అని మనం బాధపడి ప్రయోజనంలేదు. అనుమానించకుండా ఉండే ప్రవర్తనను కూడా చూపించాలి."

ఒక్కొక్కమాట మన్మథ పాలిట విద్యుద్ఘాతంలా తగులుతోంది. "నా ప్రవర్తనలో ఏం పొరపాటు కన్పించి, ఇంత

అభాండం నా నెత్తిన వేస్తున్నావు కరుణా నువ్వు ?"

అతని ప్రవర్తనలో పొరపాటు లేదనీ, తనను జనుల అపవాదు నుంచి రక్షించుకోవడానికి, మన్మథను ఒప్పించి నాటకంలో నుంచి తప్పించుకోడానికీ అంతకన్నా మార్గం లేదనీ, అతనికి తెలియజెప్పలేకపోయింది స్వార్థం ఆమె నోటికి తాళం వేసింది

"సరే అయితే! పోదాం పద. నీలకంఠం గారితో చెప్పి నువ్వు తప్పుకుందువుగాని."

ఇద్దరు విషణ్ణ వదనాలతో ఆర్ట్స్ కాలేజీకి వచ్చారు. ముదురు ఎండలో తెల్ల గన్నేరులా కన్పిస్తోంది ఆర్ట్స్ కళాశాలా భవనం. ఇద్దరూ ప్రొఫెసర్ నీలకంఠం గార్ని ఆయన 'చేంబర్స్' లో కలుసుకున్నారు.

ఆయన వీళ్లిద్దరూ కలిసి రావడం చూసి ఆశ్చర్యపోయాడు. క్లాసులో ఎందుకు కనిపించలేదా అనుకున్నాడు వాళ్లను కుర్చీలో కూచోమని చెప్పి, తను తన రివాల్వింగ్ ఛెయిర్‌లో కూచుని, టేబిలుమీద ఉన్న పొడుగాటి అద్దం మీదకు మోచేతులాన్చి, "ఏమిటి ఇట్లా వచ్చారు ?" అని అడిగాడు ఎంతో ఆత్రంగా.

"నేను నాటకంలో వేషం వెయ్యడంలేదు మాష్టారూ !" అన్నది కరుణ. ఆయన ఉలిక్కిపడ్డాడు "మీ దగ్గర ఏదీ దాచడం నాకు ఇష్టంలేదు కరుణ ప్రక్కన నటించడం నాకు ఇష్టంలేదు" అన్నాడు మన్మథ.

"కారణం ?" నీలకంఠంగారి కళ్లజోడు లోంచి ఆయన తీక్షణములైన కళ్ళు సూటిగా ప్రశ్నించాయి.

"నాటకంలో నటించే పాత్రధారులకు ఒకరిమీద ఒకరికి పరిపూర్ణమైన నమ్మకం ఉండాలి దురదృష్టవశాత్తూ.." కరుణ మాట్లాడకుండా మన్మథే మాట్లాడుతున్నాడు. "నా ప్రవర్తన లోపభూయిష్టమై పోయింది. కరుణ ప్రక్కన నుంచుని నేను నటించలేను. ఇంద్రునిలా నాలోనూ పాపపు వాంఛలు ప్రళయము రేగుతున్నాయి. నన్ను, నేను కంట్రోల్ చేసుకోలేను. చిన్నప్పటినుంచీ నాది చాలా ఉద్రేక స్వభావం"

నీలకంఠం వాళ్లవేపే చూస్తూ ఉండిపోయాడు కొంతసేపు తనలో తనే మాట్లాడుకొంటున్నట్లుగా అన్నాడు ఆ తర్వాత. "మిమ్మల్ని చూసి గర్వపడ్డాను. టెర్రిబుల్ డిస్సప్పాయింట్‌మెంట్ ! మనం ఇది టేక్ అప్ చెయ్యక పోయినా బావుండేది ! కురంగేశ్వరరావుగార్కి ఇవ్వాళ పెద్ద పండుగ అవుతుంది. వెల్ ! యూ కెన్ గో."



కరుణ కళ్ళలో నీళ్లు మెల్లగా కాళ్లీడ్చుకొంటూ వెళ్లిపోయింది. మన్మథ కూడా లేవబోయాడు వెళ్లడానికి లేస్తూ అన్నాడు. "నన్ను క్షమించండి మాష్టారూ మీ డిజప్పాయింట్‌మెంట్‌కు !"

"పిచ్చివాడా ! నీ నిజాయితీకి, ఆత్మశుద్ధికి నిన్నభినందిస్తున్నాను. కరుణను గాక, రజనిని అహల్యగా వేయిద్దాం. ఏం ?" అప్పటికే తన మూలంగా ఆయనకు కలిగిన కష్టానికీ నిరాశకూ తనను తను తిట్టుకొంటున్న మన్మథకు, అంగీకారం ఇవ్వడం తప్ప మరో మార్గం కన్పించలేదు. "మీ యిష్టమండీ !" అని చెప్పి బయటకు వచ్చేశాడు. మెట్ల దగ్గర కరుణ అతని కోసం ఎదురు చూస్తోంది. అతన్ని చూడగానే దగ్గరకు వచ్చి, చేతులు రెండూ పుచ్చుకొని, "నీమీద దోషారోపణం చేసుకున్నావా బావా ?" అన్నది ఆవేశంతో. మెట్లమీద నుండి ఏదో క్లిక్ మన్నది. ఉలిక్కిపడి తలెత్తి చూస్తే, ఎవరో గోడ ప్రక్కకు తప్పుకోవడం, పెద్దగా నవ్వులు విన్పించాయి. మన్మథ పైకి గబగబా పరుగెత్తి వెతికాడు పరిశీలించాడు. అనుమానాస్పదు లెవ్వరు లేరు.

ఇద్దరూ కలిసి రోడ్డుమీదకు వచ్చేసి ఎవరి మార్గాన వాళ్ళు వెళ్లిపోయేటప్పుడు కరుణ రెండు చేతులూ పట్టుకుని, గద్గదికమైన కంఠంతో అన్నాడు. "నామీద

అనుమానం లేదని ఒక్కసారి అను కరుణా !"

కరుణ 'లేదు' అందామనుకొన్నది. పెదిమలు కదిలాడాయి. వణికాయి. చేతులు వెనక్కు లాగాయి. కళ్ళు క్రిందికు వాలాయి. ఎవరో దూరం నుంచి వస్తూ వాళ్లనే చూస్తున్నారు. చేతులు లాగేసుకుని, 'వస్తాను" అని వెళ్లిపోయింది.

వెళ్లిపోయిన కరుణను చూస్తూ అక్కడే నిల్చున్నాడు మన్మథ. సముద్రమంత ఎత్తుగా ఎగసి పడుతున్నది అతని హృదయం. ఆడవారి మనస్సు కనుక్కోవడం కష్టం అనుకొంటున్నది. ఎందుకు నమ్ముతారో, ఎందుకు అనుమానిస్తున్నారో, వారికే తెలియని వింత మనుష్యులు వాళ్ళు ! సృష్టిలో భగవంతుడు చేసిన బలహీనమైన వాటిలో కెల్లా బలహీనమైనది స్త్రీ ! కాని ఆ స్త్రీయే తిరిగి, బలవంతుడైన పురుషుణ్ణి బలహీనుణ్ణి చేస్తున్నది! కాళ్లీడ్చుకుంటూ, మెల్లగా హోస్టలు గదికి చేరుకునేసరికి, గది దగ్గరగా, వో కుర్చీలో కూచుని కనిపించాడు చలపతి. ఆశ్చర్యంతో, "మీ రెప్పుడు వచ్చారు ?" అన్నాడు.

"అంతా రెండుగంట లయింది. ఆట్లా

# కరుణ

చిక్కిపోయినావేం నాయనా ?" అన్నాడు చలపతి.

"నిన్ను చూడ్డామనిపించింది, బయలుదేరి వచ్చాను. అసలు రాగలనా అని అనుకొన్నాను. నిన్ను మళ్లీ కళ్ల జూడగలనా అని అనుకొన్నాడు" చలపతి చెప్పుకుపోతున్నాడు. మన్మథ గది తలుపు తీసి, "లోపలకు రండి. స్నానం చేయండి. మెస్‌కు వెళ్లి భోంచేద్దాం" అన్నాడు.

భోజనంచేసి వచ్చిం తర్వాత, కాసేపు ఆమాటా ఈమాటా మాట్లాడి అప్పుడు గాని తన మనసులో ఉన్న విషయం చలపతి బయట పెట్టలేదు. "నే నిక్కడే ఉండటానికి వచ్చాను అబ్బాయీ ! మనిద్దరం వూళ్లో ఎక్కడో ఇల్లు తీసుకుందాం. ఎవరో వో మనిషిని పెట్టి వండించుకు తిందాం. ఎవరూ దొరక్కపోతే హోటల్ ఉంది."

"ఇక్కడా ? ఇల్లా ?"

మన్మథ సంభ్రమం చూసి, చలపతి ధైర్యం చెబుతున్నట్లుగా అన్నాడు. "అవున్నాయనా ! ఇల్లే ! అక్కడ ఇల్లు తాళం




వేసేసేను ! పొలం కౌలుకు ఇచ్చేసేను. నువ్వెక్కడ ఉంటే అక్కడే నాకు ఇల్లు. అదే నాకు స్వర్గం !!"

"పొలం కౌలుకు ఇచ్చేశారా ?"

"నా అన్నవాళ్ళు లేనప్పుడు ఏం చేయమంటావ్ ? అందరూ నన్ను ఒంటరి వాణ్ని చేసి వదిలిపెట్టి పోయినప్పుడు నన్నేం చేయమంటావ్ ?" మన్మథ, చలపతి చెబుతున్న దేమిటో అర్థంగాక ప్రశ్నగా ఆయనవైపు చూశాడు. చలపతి చెప్పాడు. "నువ్వు నన్ను నాన్నా అని పిలవడం వాళ్లకు ఇష్టంలేదు. నీతోపాటు ప్రసన్నకు, కాదు, వీరభద్రానికి ఈ ఆస్తినంతా దోచిపెట్టమన్నారు." అంటూ ఆ కథంతా చెప్పి, "చెప్పు నాయనా! ఇందులో నాదేం తప్పుంది ? నువ్వు నాదే తప్పంటే, ఇప్పుడే వెళ్లి వాళ్లను క్షమాపణ వేడుకొంటాను. చెప్పు." అంటూ అడిగాడు.

"లేదు. మీదేం లేదు. ఆ వీరభద్రం కోసమని ఆస్తి తాకట్టు పెట్టకపోవడమే మంచిపని చేశారు. ఇందులో ఎవరికి కోపం వచ్చినా, పర్వాలేదు. మీరు ఒంటరివాడుగా ఉన్నానని భయపడొద్దు. నేనున్నాను మీకు !" అన్నాడు ఒకానొక ఆవేశంలో.

"అవున్నాయనా ! నువ్వున్నావనే అంతా వదులుకొని ఇక్కడకు పరుగెత్తుకు వచ్చాను."

"మంచిపనే చేశారు !"

మన్మథకు ఎదురుగా గోడమీద వెంకటేశ్వరుని పటం కనిపించింది. "తండ్రీ! కన్నతండ్రికి నేను చేసిన అపకారం ఏమిటి? ప్రసన్న వంటి వాణ్ని కాదా నేను ?" అనుకున్నాడు. కాని దేవుడు మాట్లాడలేదు.

* * *

ప్రసన్న వాల్తేరు స్టేషన్లో దిగి, ఎవరన్నా తనను రిసీవ్ చేసుకోడానికి వచ్చారేమోనని కాసేపు ప్లాట్‌ఫారంమీద నిలబడ్డాడు. ఎవరూ రాలేదు. అతనికన్న అతని మనస్సు ముందుగా ఆత్మీయుల దగ్గరకు పరుగెత్తుతోంది. ఎవరూ రాకపోవడం కొంత నిరుత్సాహాన్ని అతనికి కల్గజేసింది. మూడు గంటలకు చేరా

ల్పిన మెయిలు, అతి కష్టంమీద నాలు గున్నరకు చేరింది. నగరంలో సాయంత్ర మవుతున్న సూచన, ప్లాట్‌ఫారంమీద చిక్క బడుతున్న జనమే తెలుపుతున్నారు.

సూట్‌కేసు తీసుకుని ప్రసన్న స్టేషను బయటకు వచ్చాడు. ఎక్కడికి వెళ్లడం అన్న ప్రశ్న ఎదురైంది. తన రాకకోసం కన్నులు కాయలు కాయగా ఎదురు చూస్తున్న అర్ధాంగి దగ్గరకా? తన రక్తం పంచుకు పుట్టిన అన్నగారి ఆతిథ్యం తను స్వీకరించాలా? కరుణ పరాయివారి ఇంట ఉన్న కారణంచేత, కొంత బిడియ పడి, మన్మథ దగ్గరకే వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. వీరభద్రం దగ్గరకు వెళ్దామన్నా, అతని చిరునామా ప్రసన్న

దగ్గర లేదు. టాక్సీ చేసుకుని, యూనివర్సిటీ విద్యార్థులు మరికొందరు కూడా ఆ టాక్సీలోనే ఎక్కి తోడు రాగా, మన్మథ దగ్గరకు బయలుదేరాడు ప్రసన్న.

దారిలో ఒకతను ప్రసన్నను అడిగాడు. "మీరే ఇయర్ చదువుతున్నారు?"

ప్రసన్న జవాబు చెప్పడానికి సిగ్గుపడ్డాడు. "లేదండీ! ఇక్కడ స్టూడెంటుని కాదు. మా బ్రదర్‌ని చూట్టానికి వస్తున్నాను" 'ఎవరా బ్రదర్?' అన్న ప్రశ్న వచ్చింది. మన్మథ అన్న పేరు వినగానే వాళ్లలో ఒకడు తలాడించి, "అవునవును. ఎం. ఏ. ప్రీవియస్ చదువుతున్నాడు కదూ? స్థిరగా, పొడుగ్గా ఉంటాడు. ఇవ్వాళ రాత్రి నాటకంలో ఇంద్రుడు వేషం వేస్తున్నాడు!"

ప్రసన్నకు, మన్మథ వాళ్లేత్రులో కూడా చదువు సంగతి పట్టించుకోకుండా నాటకాల్లో వేషాలేయడం అంతగా నచ్చలేదు. అయినా, అది సమయమూ, సందర్భమూ కాదు కాబట్టి తనను తాను నిగ్రహించుకొన్నాడు. మళ్లీ ఆ స్నేహితులే తమలో తాము మాట్లాడుకోవడం మొదలు పెట్టారు. వల్లగా సన్నగా ఉన్న కుర్రాడడిగాడు. "ఇంద్రుడేమిటి? ఏదన్నా పౌరాణిక నాటకమా?"

మొదటి విద్యార్థే సమాధానం చెప్పాడు. "అన్నమాటే! పద్యాల్లేంది మనవాళ్లు నాటకాలు చూడరుగా? పద్యాలుండాలంటే పౌరాణికాలో, చారిత్రకాలో ఉండాలి. ఈ నాటకం బాగానే ఉంటుందిలే. లవ్వు! అంతా లవ్వట!!"

అందరూ నవ్వారు. అందరితోపాటుగా ప్రసన్న కూడా నవ్వవలసి వచ్చింది. ఆ మొదట విద్యార్థి ఇంకా తన ఉపన్యాసం ఆపలేదు. "పైగా దీనికో ఎడిషనల్ ఎట్రాక్షన్ ఉందిట! హీరో, హీరోయిన్‌లు ఇద్దరూ యాక్చ్యుయల్ లైఫ్‌లో కూడా ప్రేమికులుట!" ప్రసన్నకు వళ్లు గగుర్పొడిచినట్లయింది. "ఏదో పోగొట్టుకొన్న వాడిలా ఉన్న మన్మథ ఇక్కడ అంత

గ్రంధసాంగు డయ్యాడన్నమాట !" అను కున్నాడు."

"ఎవర్రా ఆ లావ్ ?" కీచుగొంతు అతను అడిగిన ప్రశ్నకు సమాధానం కోసం చెవులొరబెట్టుకుని కూచున్నాడు ప్రసన్న. "అతని క్లాస్‌మేట్‌! కరుణట!!"

"అబద్ధం ! అబద్ధం!" పెద్దగా అరవా లనిపించింది ప్రసన్నకు. కారు చక్రాలు అతని మనస్సులో తిరిగిపోతున్నాయి. ప్రపంచం తలక్రిందులైన ట్లనిపిస్తోంది. రోడ్డుమీది మనుషు లందరూ తనను చూసే వెక్కిరించుకొంటున్నట్లు భావించు కొన్నాడు. అతనికి మన్మథ దగ్గరకు వెళ్ళాలనిపించలేదు. వెళ్ళక చేసేదేమిటో తెలీలేదు. ఈ వార్త నిజమే అయితే ఇంత దూరం తను రావడం ఎందుకు ? ఎవరో అన్న మాటనుబట్టి తన అన్నను తను ఎందుకు అనుమానించాలి? గుండెరాయి చేసుకుని మన్మథ ఉన్న గది తలుపు తట్టాడు.

ఎదురుగా తలుపుతీసి చలపతి నిలబడే సరికి, అతనికి తను కల కంటున్నాడో, వాస్తవం అనుభవంలోకి తెచ్చుకుంటున్నాడో, తెలియలేదు. "మీరెప్పు డొచ్చారు ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నువ్విలా వచ్చావేం?" అన్నాడు చల పతి అనుమానంగా.

ఇద్దరికీ అంతకన్నా ఏం మాట్లా డాలో తెలీలేదు. మాట్లాడుకో దల్చుకుంటే కొన్ని వందల విశేషాలు ఉంటాయి. కానీ తమవాళ్ళు కాదనుకొన్న మనుషులతో ఏం మాట్లాడడం ? ఇద్దరూ బొమ్మలా, మంత్రించిన మనుషుల్లా, చెరో కుర్చీ లోనూ కూచున్నారు, మన్మథ వచ్చే వరకూ.

మన్మథకు సహజంగానే తమ్ముణ్ణి చూడగానే, నిద్రాణమై ఉన్న అనురాగం ఒక్కసారి పొంగింది.

"తమ్ముడూ ! ఎప్పుడొచ్చావ్ ?" అంటూ కౌగలించుకున్నాడు.

కౌగలించుకొంటున్నప్పుడు, ప్రసన్న భుజం మీదుగా చలపతి కనిపించాడు. చలపతి కనిపించడంతోటే, ఆయన వంటరివాడు కావడానికి, దిక్కులేనివాడుగా ఇల్లూ పొలాలూ అన్నీ వదిలిపెట్టి తన దగ్గరకు పరుగెత్తుకు రావటానికి, తను కరుణను పెళ్ళి చేసుకోలేక పోవటానికి, కన్నవాళ్ళ ప్రేమ తనమీద అంతగా లేక పోవటానికి, అన్నింటికీ ప్రసన్నే కదా కారణం అనుకొన్నాడు. అనుకోవడంతో, కౌగిలి వదిలి దూరంగా నిల్చున్నాడు.

భ్రాతృస్పర్శా సుఖాన్నీ, ఆలింగన మాధు ర్యాన్నీ అనుభవిస్తున్న ప్రసన్నకు అంతలో అది దూరం కావడం ఎందుకో తెలియ లేదు. తెల్లబోయి, దూరంగా జరిగి నిల్చున్న అన్న వంక చూశాడు.

మన్మథ యాంత్రికంగా అడిగాడు : "అందరూ కులాసాయేనా ?"

"ఆఁ! నాన్నారికీ వంట్లో ఏం బాగో లేదు. మంచంలోనే అన్నీ కొన్నాళ్ళు."

చలపతి వాళ్ళ సంభాషణకు అడ్డం వస్తూ అడిగాడు. "ఇంతాలస్యం అయిందేం నాయనా, ఇవ్వాళ ?"

"రిహార్సలుకు అందరూ రావడం కొంత ఆలస్యమైంది నాన్నగారూ ! పైగా ఇవ్వాళ స్టేజీమీద ఫుల్ డ్రెస్ రిహార్సలు." మన్మథ సమాధానం, ప్రసన్నలో రేగిన కల్లోలాన్ని మరింత సంక్షుభితం చేసింది. తను విన్న మాటలు నిజమే నేమో అన్న అనుమానం మళ్ళీ నీరుపోసుకుంది.

"ఏం నాటకం అన్నయ్యా ?" అను మానం తీరక, తీర్చుకోడానికి మరో మార్గం లేక అడిగిన ప్రశ్న.

"అహల్యా శాప విమోచనం ! అందులో నాది ఇంద్రుడి పాత్ర. స్నానం అదీ చేసి రెడీ గా. ఇవ్వాళ ప్రదర్శనకు మన దేశ ములో ఎక్కడా లేనటువంటి, ఆంధ్రా యూనివర్సిటీ స్టేజీమీద ఎటువంటి చప్పని నాటకమైనా ఎంత బాగా నటి స్తుందో, ఎంత నాసిరకం నటుడైనా ఎంత బాగా రాణిస్తాడో నీకు తెలుస్తుంది."

"అహల్య ఎవరు అన్నయ్యా ?" అని అడుగుదా మనుకొన్నాడు. కొంపతీసి కరుణ అని చెబితే ? అయినా కరుణే గనుక అయితే, ఇంతకు పూర్వమే చెప్పి ఉండే వాడు కాదూ ?" ప్రసన్న మనస్సు ప్రశ్నల సాలెగూటిలో చిక్కుకుంటోంది. 'ఉహూ, దీనికి మన్మథను అడిగి లాభంలేదు. అడి గినా మన్మథ చాలా తేలికగా తప్పించుకో గలడు. తను వెంటనే కరుణ దగ్గరకు వెళ్ళాలి. కరుణ గనుక నాటకమే వేస్తున్న ట్లయితే, ఈపాటికే స్టేజీ దగ్గరకు మేకప్ కోసమని వెళ్ళిపోయి ఉంటుంది; లేదా వెళ్ళడానికి తయారవుతూ ఉంటుంది. తనను చూడగానే ఆ కళ్ళల్లో భయం కనిపిస్తుంది. తప్పుచేసిన ఆ మనస్సు తలను లజ్జాభారంతో అవనతం చేస్తుంది. వాక్కు స్వేచ్ఛగా, మధురంగా పలకదు.

సాయంత్రం అయిదు గంటలవేళ చన్నీళ్ళ స్నానం చేసి, త్వరత్వరగా బట్టలు వేసుకుని తల దువ్వుకొని, గదిలో నుండి బయటకు వచ్చాడు ప్రసన్న. అప్పటికే మన్మథ చలపతి వరండాలో అతనికోసం ఎదురుచూస్తూ నిల్చున్నారు.

"మనకు పోయి కాఫీ తాగి, అటు నుండి



# కరుణ

'ఎర్స్కిన్ స్క్వేర్' కు పోదాం. అయిదున్నర నుంచీ 'ఆధునిక కవిత్వ తత్త్వం' అన్న విషయంమీద ఉపన్యాసం ఉంది. ఉపన్యాసం తర్వాత, అనుబంధ కళాశాలలో ఒకటి రెండింటి నాటకాలు. ఆ తర్వాత మా నాటకం—యూనివర్సిటీ వాళ్లది !" మన్మధ విషయాన్ని వివరించి, ప్రసన్ననూ, చలపతినీ వెంటబెట్టుకుని, వివేక విన్యాస వెనుకప్రక్కనున్న మెస్ దగ్గరకు వెళ్లాడు. పుస్తకంలో గెస్ట్ టిక్కెట్టు వ్రాసి తనకూ, మిగిలిన ఇద్దరకూ కాఫీ, టిఫిన్లు తెప్పించాడు.

"అలవాటులేని అవుపోసనం, నా కెందుకూ ఇవి" అంటూనే వాటిని పుచ్చుకొంటూ మువ్వు ఈ హాస్టలు వదిలిపెట్టే దెప్పుడూ?"అనిఅడిగాడుచలపతి మన్మధను.

ప్రసన్న మన్మధవేపు ప్రశ్నార్ధకంగా చూశాడు. "హాస్టలు వదిలిపెట్టడమేమిటి? అని అడిగాడు.

మన్మధను సమాధానం చెప్పనీయకుండా, చలపతే అందుకున్నాడు. "నేనూ ఇక్కడే ఉండదల్చుకొన్నాను. ఇద్దరం కలిసి వూళ్లో నో ఇల్లు అద్దెకు తీసుకు ఉంటున్నాం."

ప్రసన్న అడగకుండా ఉండలేకపోయాడు "అక్కడ ఇల్లూ, వాకిలీ, పొలం, పుట్రా."

"ఎక్కడికీ పోవు. ఇల్లు అద్దెకు యిస్తే ఎవరో ఒకరు మహరాజాగా ఉంటారు. పొలం కావాలనుకునేవాళ్లు లక్షమంది. ఆ అయివేజు పెట్టి, మేం ఇద్దరం లక్షణంగా యిక్కడ ఉండగలం."

చలపతి కంఠంలో నిర్లక్ష్యం ధ్వనిస్తోంది. ఆయన ధోరణి ప్రసన్నకు నచ్చలేదు. మన్మధ కాఫీ చప్పరిస్తూ, తనకు ఇవేమీ పట్టనట్టు, తెలిసిన స్నేహితునితో మాట్లాడుతున్నాడు; అర్ధంలేని కబుర్లు ఏమేమో !

"ఉండలేరని కాదు, మనుషులు మారిపోయినప్పుడుఎక్కడైనాఉండగలరు కానీ . ."

చలపతి తాగుతూ తాగుతూన్న కాఫీ కప్పు క్రింద పెట్టి "ఏమిటీ ? మనుషులు మారిపోయారా ?" అన్నాడు కోపంగా "అసలు, నువ్వు కాదూ, మనుషులు ఇట్లా మారిపోడానికి కారణం? ఆ సంగతి ఎన్నడైనా ఆలోచించుకున్నావా? పైగా ఇప్పుడు నన్నంటున్నావా?—గురువిందగింజ క్రింద—నలుపెరుగదట."

ప్రసన్నకు ఆశ్చర్యం, భయం, బాధ, కోపం, అన్నీ ఒక్కసారి కలిగాయి. చుట్టు ప్రక్కలకు చూశాడు. చెదురు మదురుగా ఒకరిద్దరు విద్యార్థులు తప్ప, ఎవరూ కన్పించలేదు. వాళ్ళయినా విడుదల కావలసిన హిందీ సినిమాలను గురించీ, భారత దేశం, ఆస్ట్రేలియాతో ఆడవలసిన అయిదవ టెస్టు మ్యాచ్ గురించీ బిగ్గరగా చర్చించుకుంటున్నారే కాని, అతని విషయం పట్టించుకోవడంలేదు. మన్మధ, తన స్నేహితుణ్ని తీసుకుని, ఇప్పుడే వస్తానంటూ బయటకు వెళ్లాడు.

"పెద్దగా అరవొద్దు బాబాయ్ ! మనకు ఆవేశాలు వద్దు. మనం శత్రువులం కాము. ఒక ఇంటివాళ్లం. అభిప్రాయ భేదాలు వచ్చినంత మాత్రాన బజారు మనుష్యుల్లా మనం వెలితిపడ నక్కర లేదు" అన్నాడు.

"నేనుట్రా ! నేనుట్రా !—అరుస్తోంది! బజారు మనిషిలా వెలితిపడ్డ దెవ్రరా ?—నువ్వు కాదూ ?—కాకపోతే ఎందుకొచ్చావ్? నా వెనకాలే ఎందుకు పరుగెత్తుకు వచ్చావూ అని? మన్మధ మనసు మార్చేయడానికి కాకపోతే ! ఎవరో చెప్పారు నీకు, నే నిక్కడకు వస్తున్నానని, దాంతో దబ్బరభ అంటూ మువ్వూ తైతెక్కలాడుతూ వచ్చావు. అయినా చెబుతున్నాను విన బ్బాయ్ ! ఇదే మీ నాన్నకు కూడా చెప్పు! మన్మధను నేను కనకపోయినా, నా తండ్రే వాడు ! నా ఆశలన్నీ వాడిమీదే ! నాకూ వాడికీ మధ్యభేదాలు పెట్టడం, వన్ను వంటరివాణ్ని చేయడం, ఇంకా నా ఆస్తి వాడికి కాకుండా కాజేయడం, ఇవన్నీ కుదరవని చెప్పు! మేం ఇద్దరం, ఒకటి .... ఒకటి... " అంటూ చలపతి లేచి, బయటకు నడిచాడు. ప్రసన్న కూడా ఆయన్ను అనుసరించాడు. బయట వస్తూ మన్మధ.

(సశేషం)

# స్నేహానుబంధము

## గ్లాసెడు కిసాన్ స్క్వాష్




మొనాకో బిస్కట్లతో కిసాన్ స్క్వాష్... ఎంతో రుచి, పిల్లలా తీసుకుంటారు

విలాసవంతమైన యువక ప్రపంచంలో అనుకోకుండా ఆవిర్భవించింది ఇది. కిసాన్ స్క్వాష! – అహా! ఎంతరుచి! – ఉల్లాసవంతమైన విచ్చేలులకు. దీని ప్రత్యేకమైన రుచి ఉత్తేజాన్ని కల్గిస్తుంది. అంతకంటే కూడా సహజమైన విటమినులతో ఆరోగ్యదాయకంగా ఉంటుంది – (సీసాలో అసలుపండు కన్పిస్తుంది).

ఆధునాతన జీవిత విర్మాతలతో సరిసమంగా చేరండి. ఒక గ్లాసెడు కిసాన్ స్క్వాష్ చెలిమితో.

నారింజ, నిమ్మ, మామిడి ఇంకా ఇతర రకాలనుండి మీకు ఇష్టమైనదానిని వాడండి.

కిసాన్ స్క్వాష్‌తో అసలు పళ్లరుచిని అనుభవిస్తారు

భారతదేశంలో విస్తారంగా అమ్ముడుపోయే స్క్వాష్
కిసాన్ ప్రోడక్ట్స్ లిమిటెడ్, బెంగళూరు.

INT KP-1479

**మేషం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడడం వలన తరువాత బాగా ఉన్నప్పటికీ యీవారం సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో మీకు మున్ముందు లాభించగల మార్పులు వస్తాయి వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది కాని, మీ తాలూకు ముఖ్యమైన కాగితాలు గాని, వస్తువులు గాని పోయే ప్రమాదం ఉంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభ మూలంగా ధన వ్యయం జరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృషభం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు మీరు అనుకొన్నట్లుగా జరుగకపోవచ్చును గాని, మొత్తంమీద ఆదాయం మాత్రం బాగా ఉంటుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో ఆకస్మికంగా అన్ని వ్యవహారాల్లోనూ ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. అలంకార వస్తువులు కొంటారు.

# వారఫలం

**8-4-1966 శుక్రవారం మొదలు 14-4-1966 గురువారం వరకు.**

**మిధునం :** అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని, మీరు ఏమాత్రం అశ్రద్ధగా ఉన్నా వృత్తి వ్యాపారాల్లో ప్రయాస మీద, ప్రయోజనం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లోను అధికారులు మీ యెడల అనుకూలంగానే ఉన్నా యితరుల జోక్యం వలన ఆటంకాలు కలుగవచ్చును వ్యాపారంలో అకారణంగా పోటీవారితో భేదాభిప్రాయాలు కలుగగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి యిది సమయంకాదు కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు సంఘ సేవికలకు మంచి సమయం.

**కర్కాటకం :** ఈవారం మీరుచేసే ప్రయత్నాలు వ్యర్థమై పోయినట్లు కన్పిస్తాయి గాని, వాటి ప్రయోజనాన్ని మున్ముందు మీరు తప్పకుండా పొందగలరు. వ్యాపారంలో యిదివరకు ఏవో కారణాల వలన ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తిచేయగలరు తాత్కాలికమైన మొగమాటాలకు లొంగిపోయి డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం తగదు. వృత్తిలో కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం వలన కార్యభారం పెరుగుతుంది. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి శుభ మూలంగా ధనవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగల సూచనలు ఉన్నాయి.

**సింహం** గతవారం కంటే యీ వారం బాగా ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగల సూచనలు ఉన్నాయి. నూతన వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో మీ ఆలోచనలు మీకే కాకుండా, మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. మీరు యిదివరకు జరిపిన ఆర్థిక వ్యవహారాలవలన యిప్పుడు ఒత్తిడి రావచ్చును ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది. శుభకార్యాలు కొంచెం శ్రమ మీద నెరవేరతాయి

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో యింతవరకూ మీకు సహాయంగా ఉన్న వారే యిప్పుడ మిమ్మల్ని వ్యతిరేకించడం వలన మీవారెవరో పైవారెవరో తెలియని పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడడం వలన మీర పొందవలసినంత ప్రయోజనాన్ని పొందలేక పోవచ్చును. దూర ప్రయాణాల వాయిదా వేయడం మంచిది. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు. ఆదాయంతో నిమిత్తం లేకుండా సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. ఉష్ణసంబంధమైన అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు— కుటుంబకార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి అనుకూలమైన వార్తలను వింటారు.

**తుల :** ఆర్థిక వ్యవహారాలకంటే ఆరోగ్యవిషయంలో శ్రాగ్రత అవసరం వృత్తిలో మీరు యిప్పుడు జరిపేవ్యవహారాలవల్ల మున్ముందు కొంత యిబ్బంది కలగవచ్చును భాగస్వాములతో కలిసి చేసేవ్యాపారాల్లో నూతనావకాశాల లభిస్తాయి. అధికారులవల్ల జరగవలసిన వ్యవహారాలను పూర్తిగా నెరవేరేవరకూ నమ్మడానికి అవకాశంలేదు ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అధికారులు ఆమోదించడం వలన పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీకు మున్ముందు ఉపయోగించగల వ్యక్తులను కల్సుకొంటారు కుటుంబ సంతోషం లభిస్తుంది

స్త్రీలకు ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం తగదు. సంతోషకరమైన వార్తలను వింటారు.



**వృశ్చికం :** గతవారం కంటే యీవారం బాగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన అనిశ్చిత పరిస్థితులు తొలగిపోవడంవలన మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం లభిస్తుంది వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించ గలరు. వ్యాపారవిస్తరణ ప్రయత్నాల్లో ప్రోత్సాహ కరమైన పరిస్థితులు యేర్పడతాయి. రాజకీయవ్యవహారాల్లో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. సాహిత్యకళారంగాల్లో మీకృషికి ఆటంకాలు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది

స్త్రీలకు కుటుంబకార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలించగలదు.

**ధనుస్సు :** ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వారం ప్రారంభంలోనే వృతి వ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయిగాని వారాంతానికి వాటిని పరిష్కరించడమే కాకుండా తగినంత అభివృద్ధిని సాధించగలరు మీరుస్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు, కొన్ని వ్యవహారాల్లో మీ అంచనాలను మించిన వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఇబ్బంది కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం :** వృత్తివ్యాపారాల్లో ఆదాయం బాగానే ఉన్నా, అప్పుడప్పుడు కార్యసాధనకోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా వ్యవహరించవలసిన అవసరం యేర్పడడం వలన యీవారం సంతృప్తికరంగా ఉండదు ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాల్లు బాగానే ఉన్నా ఇతరులనిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది భారీయెత్తున చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి యిది సమయంకాదు. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహించవలసి వస్తుంది వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి స్వల్ప అనారోగ్యం చేయ వచ్చును.

స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోయే సూచనలు ఉన్నాయి

**కుంభం :** వృత్తివ్యాపారాల్లో మీఆలోచనకు తగిన అవకాశాలు లభించడం వలన అధికాదాయంతో పాటు సాటివారిలో గౌరవంకూడా లభిస్తుంది వ్యాపారంలో యిదివరకు మీ యెడల ముఖావంగా ఉన్నవారు కూడా యిప్పుడు మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. వృత్తిలో నూతనావకాశాలకోసం చేసేప్రయత్నాల్లో కొంతమంది ప్రముఖుల సహకారం లభించగలదు ఉద్యోగంలో మీరుచేయవలసిన ముఖ్యమైన పనులు వారం మధ్యలో పూర్తిచేయడం మంచిది విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు ఆరోగ్యం బాగానే ఉంటుంది సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి దైవ కార్యాలు నెరవేరతాయి.

**మీనం :** వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు సులువుగానే నెరవేరతాయిగాని కొన్ని వ్యవహారాల్లో మీరు మొగమాటానికి లొంగిపోవడం వలన అనవసరమైన ప్రయాసలకు గురికాగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ఇదివరకు చేజారిపోయిన అవకాశాలు కూడా తిరిగి లభించవచ్చును. దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీవ్యవహారాల్లో మీ ఆలోచనలకు అనువైన సంఘటనలు జరుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల అడావుడి పెరగడం వలన మీకార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరగవచ్చును. స్త్రీలకు ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో మీప్రయత్నాలు ఫలిస్తాయి.

—మహేష్ ●

# హాలీవుడ్ ప్రణయాలు

గాబీ బ్రుయర్



నా సహాయంపొందిన మారిలిన్.

నేను, గాబీ బ్రుయెర్ ని, ఒక చిన్న నటిని, మైక్ టాడ్ కి సాయం చెయ్యగలగటం ఆశ్చర్యమే. కాని, నేను మరొక చాలా పెద్దమనిషి ప్రాణం రక్షించాను. ఈ మహా వ్యక్తి ఎవరో కాదు మారిలిన్ మన్రో! ఈసారి జో షెంక్స్ తో నా స్నేహమే తోడ్పడింది.

ఒక మధ్యాహ్నం నేను అతని ఈతకొలను లో మునిగి తేలుతూ ఉండగా మాసిపోయిన దుస్తులతో తలుపు దగ్గర ఏడుస్తూ నుంచున్న ఒక అమ్మాయిని చూశాను. లోపలికి వెళ్లటానికే భయపడుతోంది. నాకు జాలి వేసింది. ఆమెను సమీపించాను. ఏమి కావాలని అడిగాను.

"జో షెంక్స్ ని చూడాలి!" అంది ఏడుస్తూ.

"ఏడవకు, పిలుస్తాను. ఇంతకీ నీపేరు?"

"మేరిలిన్ మన్రో" అని ఆమె అనే సరికి నాకు మూర్ఛ వచ్చినంత పనయింది

అప్పటికి ఆమె అంత సుప్రసిద్ధురాలు కాదు కాని ఆమె పేరు మాత్రం చాలా మందికి తెలుసు. షెంక్స్ మొదట్లో నా కోరికని మన్నించనన్నాడు. చివరికి నా బాధ పడలేక మారిలిన్ ని చూస్తా నన్నాడు. అప్పట్లో మారిలిన్ కి స్టూడియోలలో సరయిన ఆదరణ దొరకటంలేదు. ఆమెకి సప్పని పాత్రలు ఇచ్చి, జీతం సరిగా ఇవ్వక ఆమెని ఏడిపించుకు తింటున్నారు... కాని, షెంక్స్ ని కలిసిన తర్వాత ఇవన్నీ సర్దుకుపోయాయి.

ఇదంతా వేరే గొడవ. ఈ వ్యాస శీర్షిక ప్రణయాలని గురించి కదా ! హాలీవుడ్ పురుషుల్లో ఎక్కువమందికి వస్తాదులకి ఉండవలసిన దేహాలూ, కండలూ ఉంటాయి ఇదీ ఒక యిబ్బందే.

ఒకరాత్రి జేన్ మాన్స్ ఫీల్డ్ భర్తని ఏదో పార్టీలో కలిశాను. మిక్కీ హార్గిటే ఒక సంవత్సరం "మిస్టర్ అమెరికా" బిరుదు (దేహసౌందర్యానికి) పొందాడు. నా పక్కనే కూర్చుని నేను చెప్పే కబుర్లని పరధ్యాన్నంగా వింటూ ఉండిపోయాడు. మధ్యలో, హఠాత్తుగా "నా ఛాతీ చుట్టుకొలత ఎంతో నీకు తెలుసా ?" అని అడిగాడు.

"నీ ఛాతీ గురించి తెలీదు కాని నీ భార్య ఛాతీ లెక్కలు అందరికీ తెలిసినదే కదా ?" అన్నాను.

"అదే ! నా ఛాతీ రెండు రెట్లు పెద్దది తెలుసా ?" అంటూ ఇంకా ఏవేవో లెక్కలు చెప్పాడు. దాంతో ఊరుకోకుండా కోటు విప్పి తన కండ బలం చూపించాడు. అవతల కూర్చున్న అతని భార్య, జేన్ మాన్స్ ఫీల్డ్ అతన్ని విపరీతంగా ప్రోత్సాహించింది—

"డార్లింగ్, నీ ట్రయిసెప్స్ చూపించు, నీ కండల బలం ఎలాంటిదో చూపించు ." అంటూ. "డార్లింగ్" బిరుదు కల మనిషి ఆనందానికి అంతులేదు!




హాలీవుడ్ ప్రణయాలలో ఒకటి! అవాగార్డ్నర్, తోడు.

ఫ్రాన్స్‌లో ప్రేమించుకున్న ఒక జంట ఎక్కడికన్నా వెడితే, వీలయినంత విశ్రాంతి, విలాసాలతో కాలం గడుపుతారు. ఒకరి సాంగత్యం మరొకరు కోరుతారు. కాని హాలీవుడ్‌లో—వేకువతో నిద్ర లేవటం, ఒక గంట గుర్రపు స్వారీ లేదా రెండు గంటలు, తర్వాత ఈతకొలను, ఆపైన ఒక రొట్టెముక్క, ఇది తిన్న తర్వాత ఏదో ఆట, వళ్లంతా అలిసిపోయేదాకా—టెన్నిస్, క్రోకె వగయిరా!—డ్రింక్‌లు. ఇక ప్రణయానికి తీరిక ఏది? కండ బలం తప్ప వేరే ధ్యాసే లేదా అనిపిస్తుంది. ఈ పిచ్చివల్లనే జింజర్ రాజర్స్—జాక్వెస్ బెర్జెరాక్‌ల వివాహం నాశనం అయిందని నా నమ్మకం.

జాక్వెస్ మంచి టెన్నిస్ ఆటగాడు. అందుకనే అతన్ని పెళ్లిచేసుకున్నా ననేది జింజర్. కాని ఎంతసేపని టెన్నిస్

# హాలీవుడ్ ప్రణయాలు

గురించి మాట్లాడగలడు? ఒకసారి నాకు టెలిఫోన్ చేసి చెప్పాడు, "ఎవరయినా ఫ్రెంచివాళ్లతో, టెన్నిస్‌ని గురించి కాకుండా, ఏదయినా మాట్లాడాలని ఉంది" అని. నేను మాత్రం 'నాతోకాదు, ఈ ఊళ్లో ఫ్రెంచి కాన్సుల్‌తో వెళ్లి మాట్లా'డమని సలహా చెప్పాను. అందుకనేనేమో మేమిద్దరం మంచి స్నేహితులంగా ఉండిపోయాము!

ఇంకో చిన్న కథ చెప్తాను బిల్ థార్న్‌టన్ అనే ఒక సెనేటర్ ఉండేవాడు. ఆరడుగులపైన పొడుగు మనిషి. ఎంత తాగినా చెక్కు చెదరడనే కీర్తి కలవాడు. నాకు తటస్థించాడు. ఒక సాయంత్రం మేమిద్దరం కలిసి లాక్స్ ఆంజెలెస్‌లోని 'లాస్కాండియా' అనే హొటల్‌కి భోజనానికి వెళ్లాము. అక్కడ ఏదో 'డ్రింక్'లు ఏవేవో తాగాడు. విస్కీ తాగితే తట్టుకునేవాడేమో కాని వాటికి తట్టుకోలేక పోయాడు. 'డిన్నర్' అయిపోయే సమయానికి ఇంచుమించు స్పృహతప్పి ఉన్నాడు. ఆ పరిస్థితిలో అతని హొటలుకి పంపితే చాలా గొడవ అవుతుందని, అతన్ని నా గదికి రహస్యంగా తీసుకు వెళ్లాను.

మర్నాడు స్మృతివచ్చిన సెనేటర్‌గారికి తన పరువే పోయిందనిపించింది. తనంతటివాడు కొన్ని స్వీడిష్ 'డ్రింక్' లకి తట్టుకోలేక పోవటమా! అవమానం భరించలేక హాలీవుడ్ నుంచి మాయమయి పోయాడు. ఇతన్ని చూసి ఎంతో మోజుపడిన జింజర్ రోజర్స్ కొంచెం నిరాశ చెందింది. ఇలా ఉంటాయి హాలీవుడ్ ప్రణయాలు!

(సశేషం)

















ముఖచిత్రసుందరి



# ఆద్యంతాల మధ్య మహానటి

కాలంమారుతూ, వ్యక్తిత్వాలస్థాయి పరిణితి, పరిణామమూ చెందితే, అభిరుచులకు వుండే విలువలు కూడా మారటం సహజమూ, కాలధర్మమూ! ఈనాడు మనకు నచ్చిన వ్యాసంగము, రేపటికీ అలానే ప్రేమపాత్రం కావటానికి అవరోధాలు ఎన్నో వస్తుంటాయి.

ఈ సూత్రానికీ, యీ నియమానికీ అతీతంగా నిలిచిన దక్షిణాదితార పద్మిని (మా యీ సంచిక ముఖచిత్ర సుందరి), ఉత్తరాదిలో నటిగా, నర్తకిగా అనన్యమైన విజయం సాధించిందంటే, ఆ సాధనకు, నిశ్చయంగా దీక్ష 'ప్రాతిపదిక' అయివుండాలి.

రెండు దశాబ్దాల క్రితం, ఎన్నడో, ఆమెకు కనీసం గుర్తు అయినా లేనంతపూర్వం, కేరళ మంచి తన తల్లితో మదరాసుకువచ్చి, ఒక్కమారు యీ లోకంలోకి, లోకం వెలుపలకు కలయచూచి, మనసుకు నచ్చినవిధంగా 'గజ్జె' కట్టి నాట్యమాడిన పద్మినికి, ఆనాట్యం, ఆ నటరాజూ, నాటికీ నేటికీ ఆరాధ్యాలే.

పద్మిని యీనాడింత కావటానికిముందు, చాలా మైళ్లదూరం కాల ప్రవాహానికి ఎదురీదవలసి వచ్చిందంటారు. కాని యీ 'ఎదురీత'లో ప్రవాహం నెగ్గిందో, లేక పద్మిని నెగ్గారో తేల్చిచెప్పే అవకాశమూ,అధికారమూ యీ విలేఖరికిలేవు. కారణం: అవి ఆంతరంగిక వ్యవహారాలు.

20 సంవత్సరాల క్రితం తమిళచిత్రం 'మన్ మగళ్' తో సినీ జీవితంలో అడుగెట్టిన పద్మిని యీనాటికి 226 చిత్రాల్లో నటించింది. కాని, 226 చిత్రాలదూరం ప్రయాణంచేసినా, 20 సంవత్సరాల కీర్తి ప్రతిష్ఠలసాయంతో వ్యక్తిత్వాన్ని అనంతంగా పెంచుకొన్నప్పటికీ, ఆమెలోవుండే మంచితనంలోను, అణుకువలోను మార్పుల్లేవు! పరిగదా, చైతన్య స్రవంతులు అంతకన్నా ప్రవహించలేదు. అందుకే చాలామందిలా గాకుండా, పద్మినికి ప్రత్యేకమైన గౌరవం.

ఈ గౌరవానికి మరెన్నో పునాదులు కూడా ఉన్నాయి. తానాశించిన 'నటనా జీవిత శిఖరం'మీద విజయధ్వజాన్ని ఎగురవేసిన పద్మిని, ఆ మరుక్షణమే సాంసారిక జీవితంలో ప్రవేశించి, గార్హస్త్యం చేపట్టింది. ఈనాడు ఆమె భార్య, తల్లి కూడా.

కళ ఆమెను పోషించి పెంచి, పెద్దదానిని చేసింది. ఈనాడు ఆ'కళ'ను తిరిగి పోషించేభారం పద్మిని చేపట్టింది. ఆదాయ వ్యయాలతో నిమిత్తం లేకుండా, నృత్య సంప్రదాయాలను చిరస్థాయిగా ఉంచాలనే ప్రబలమైనకాంక్షతో పద్మిని, తనలాంటి మరో పదుగురు పడుచులకు శిక్షణ యిస్తున్నది. శ్రీమతి పద్మిని అధ్వర్యాన అందమైన 'నృత్య నాటకం' ఒకటి తయారవుతున్నది. 'శాకుంతలం' దీని యితివృత్తం.

ఆమధ్య కొంతకాలం 'సినిమా'నుంచి విరమించిందన్నారు. కాని, మళ్లీ ప్రవేశించారన్నారు. రెండు తెలుగు చిత్రాల్లో ఆమె యీనాడు నాయిక. మరికొన్ని తమిళ చిత్రాల్లో కూడా నటిస్తోంది.

కాని, ఒక్కటిమాత్రం వాస్తవం. రెండు దశాబ్దాలపాటు తాను వెలిగి, తానే వెలిగించిన చిత్రసీమను యింకా అంటిపెట్టుకొనివుండటంద్వారా, శ్రీమతి పద్మిని'నృత్యపోషణ' అనే ఆశయానికి దూర దూరంగా జరిగిపోతోంది!

—[ప్రకాశం]



అక్కినేని.!

# నేనూ మద్రాసు

సరిగ్గా నాలుగు సంవత్సరాల క్రితం—నేను మదరాసు విడిచి హైదరాబాదు వెళుతున్నప్పుడూ, ఆ తరువాతా, నేను మదరాసుకు దూరం అయినానని అందరూ భావించినట్లున్నారు అలా నేనెప్పుడూ దూరంకాలేదు. కొన్ని కారణాలవలన, నేను హైదరాబాదు వెళ్లవలసి వచ్చినప్పటికీ—నా స్థిరనివాసం ఆంధ్ర రాజధానికి మార్చుకొన్నప్పటికీ—తరచు యిక్కడికి వస్తూనే వున్నాను. హైదరాబాదులో తయారయిన చిత్రాలకు కూడా కొంత పని యిక్కడే చేశాము. 'ఆత్మబలం' చిత్రంకోసం యిక్కడి కొచ్చాను ఇక్కడి స్టూడియోలో పని చేశాను. అలాగే 'మూగమనసులు' పని కూడా యిక్కడే చేశాము. ఇవిగాక జమీందార్, నవరాత్రి, మొదలయిన చిత్రాలకు అవుట్‌డోర్ పనికి యీ వూరువస్తూనేవున్నాను. ఇక నేను మదరాసుకుదూరం అయింది ఎప్పుడు?—

అలాగే నేను హైదరాబాదుకు ప్రయాణమై వెళ్ళేముందు నా అభిప్రాయాలేమిటో మిత్రులందరికీ ఎలాంటి దాపరికంలేకుండా చెప్పాను. నేను హైదరాబాదుకు వెళ్లిన కారణాలలో, నా పిల్లల చదువు ఒకటి. మనం తెలుగువాళ్లం. తెలుగు అక్షరం ముక్కలు నేర్చుకొనక, ఎందుకీ అరవం నేర్వాలి నాపిల్లలకు? అనే అభిప్రాయంతోనే అక్కడికెళ్లాను.

అంతకంటే మరో ముఖ్యవిషయం—నేను యీ పరిశ్రమనుంచి నిష్క్రమించటం! మదరాసులో ఉండగా నాకు సంబంధించిన ఫోటోలకోసం ఎన్నో 'ఆల్బమ్'లుతయారు చేయించాను. కానీ హైదరాబాదు వెళుతూ ఒకే ఒక 'ఆల్బమ్' ఖాళీగా ఉంచుకొన్నాను. అంటే త్వరలో సినిమారంగంనుంచి నిష్క్రమించాలని నేను ముందుగానే నిశ్చయించుకొన్నాను. సినిమా పరిశ్రమనుంచి విరమించుకోవాలనే దృఢ సంకల్పంతోనే హైదరాబాదు వెళ్లాను.

కాని, హైదరాబాదువెళ్లి, సినిమాలనుంచి విరమించాక ఏంచేద్దామనుకొన్నారు?... అని మీరు అడగవచ్చు.

.....నాకూ ఏదో ఒక వ్యాపకం ఉండాలి గదా! సినిమా నటుణ్ణిగా ఇంతకాలం మంచి అనుభవంతోబాటు, అందరి అభిమానాలు లభించాయి. హైదరాబాదు వెళ్లాక పరిశ్రమలు స్థాపించాలని, వాటి ద్వారా జీవనమూ, కాలక్షేపమూ చేయాలని మొదటినుంచీ నా ఆశయం ఎక్కడ ఉన్నప్పటికీ, ఎలా ఉన్నప్పటికీ నా జాగ్రత్త నేను పడాలిగదా?.... అందువల్లనే పారిశ్రామికవేత్తను కావాలని నేను ఎంతకాలంనుంచో ఉబలాటపడుతూ వున్నాను. ఆ ఆశయాన్ని సాధించుకొనేందుకే 1964లోనే సినిమాలనుంచి విరమిద్దామనుకొన్నాను. నా యితర కార్యక్రమాలుకూడా యిందుకు అనుగుణమైన విధంగానే మలచుకొంటూవచ్చాను. ఉదాహరణకు నా ఇన్సూరెన్స్ పాలసీలు చూడండి అవన్నీ 1964 నాటికి పక్వానికి వచ్చేలా ఏర్పాటు చేసికొన్నాను.

కాని, నా పథకం నెరవేరలేదు. ఈ విషయంలో నేను ఓడిపోయాను. సినిమా పరిశ్రమలో యింకా ఉండిపోవటం అనివార్యం అయిపోయింది. నేను ఒకరకంగా దీనిని 'తీయని ఓటమి' అనుకొంటున్నాను. నేను ఇంకా చిత్రాల్లో నటించటానికి ఎన్నో కారణాలున్నాయి. నేనంటే తొలుతనుంచీ ప్రేమ, అభిమానం వ్యక్తం చేస్తున్న నిర్మాతలు నన్ను యీ వృత్తినుంచి వైదొలగవద్దని వత్తిడి చేశారు. ఇంతలోకి, ప్రభుత్వంవారు 'సినిమా పరిశ్రమ'కు సహాయం చేస్తామన్నారు. ఈ పరిశ్రమలో యింతకాలంగావుండి, విశేషమైన అనుభవం గడించిన తరువాత యీ విషయంలో ప్రభుత్వానికి తోడ్పడటం నా కనీసపు ధర్మం. ఈ రెండు కారణాలకుతోడు, ప్రేక్షకులు నా నటననుచూసి విసుగు చెందలేదు. ఇంకా నన్ను ప్రేమిస్తూనేవున్నారు. నేనే కావాలంటూన్నారు. ఇలాంటి పరిస్థితుల్లో సినిమారంగంనుంచి నిష్క్రమించటం అవాంఛనీయం అనిపించింది అందుకే దీనిని మరొకమారు 'తీయని ఓటమి'గా భావిస్తాను.

సరే, ఓడిపోయాను! నేననుకొన్నట్లు పారిశ్రామికరంగంలో నేనూ ఒకణ్ణి కావటానికి పరిస్థితులు వెంటనే సాయపడలేదు 75 లక్షలరూపాయల విలువచేసే నా 'లైసెన్సు' నొకదానిని ప్రభుత్వానికే తిరిగి యివ్వవలసి వచ్చింది. నాకీనాటికే కొన్ని పరిశ్రమలున్నాయి. వీటిమీద దృష్టి లగ్నం చేయ

# చెప్పండి! మదరాసులో నటించనని నేనెప్పుడు అన్నాను?

టానికే నాకు సమయం చాలటంలేదు.

ఇక, మదరాసు రావటం విషయం. నేను మదరాసు రాననీ, మదరాసుచిత్రాల్లో నటించననీ ఎప్పుడూ అనలేదే? ఆమాట కొస్తే, దురదృష్టవశాత్తు మరెవరికయినా అలాంటి అభిప్రాయమున్నా, మదరాసురావని పైకిచెప్పే అసమర్థులెవరుంటారు?

కాని, ఎందుకో నామీద యీ దుష్ప్రచారం చెలరేగింది. ఒకరోజున, కోడంబాకం లోనే నా సమక్షంలోనే జరిగిన ఒక సంభాషణ విని ఆశ్చర్యపోయాను. మదరాసంటే నాకేదో కోపం ఉన్నట్లు అంతా అనుకొంటున్నారు. ఇది చాలా విచారకరం.

ఆమాట కొస్తే మదరాసు నాకు తల్లితో సమానం. నేను యీనేలన పెరిగిన బిడ్డనే. మదరాసు వచ్చేనాటికి, నేనో నిరాశ్రయుణ్ణి. ఈ మదరాసే నాకు ఆశ్రయం యిచ్చింది, నన్నింతవాణ్ణి చేసింది.

ఆమధ్య నేను అమెరికా వెళ్లినప్పుడు నా పరోక్షంలో యిక్కడ (మదరాసులో) నన్ను గురించి, ఏవేవో జరిగాయుట. నేను ఇండియా తిరిగి వచ్చేవరకు యివన్నీ నాకు తెలియవు. ఇన్ని వ్యవహారాలు యిక్కడ జరిగినా, నామీద లేనిపోని అభాండాలువేసినా, వీటన్నిటికి నా సమాధానం మీకు తెలుసు అది: మౌనం.

రెండు చేతులు కలిస్తేనే చప్పుడవుతుంటారు. కాని, ఒక చేయి మరోవైపు కదులుతున్నా, నేను మటుకు మౌనంగానే ఉన్నాను. ఎందుకని? చేతకానివాణ్ణి అయికాదు. బాధ్యతాయుతమైన వ్యక్తిని నేను. అందుకే నామౌనం! ఏమయినా, మదరాసుమీద నాకుండే కృతజ్ఞతాభావం అప్పటికీ, యిప్పటికీ మారలేదు.

నేను హైదరాబాద్ వెళుతున్నానని తెలిసి, నాకు ప్రియమైన నిర్మాతలు, నాకోసం అక్కడికే వచ్చారు. నేను వారికీ ఋణపడివున్నాను. నేను నటించే చిత్రాలసంఖ్య 4 నుంచి 8 కి పెంచటానికి కారణంకూడా యిదే.

అంతమాత్రాన మదరాసుమీద నాకుండే ప్రేమ తిరిగిపోయిందని ఎందుకనుకోవాలి! పైనే చెప్పినట్లు లోగడ కూడా మదరాసు వస్తూనే ఉన్నానుగదా? ఈనాడు 'ఇన్‌డోర్' లో మదరాసు చిత్రంలో నటించటానికి అంగీకరించటం యిక్కడి జర్నలిస్టులను ఆశ్చర్య పరిచిందనుకొంటా.

కొందరికి, కొన్ని సందేహాలు, యీనాటికీ ఉండటానికి కారణం లేకపోలేదు. నేను ఆమధ్య ఇండియాలో లేని సమయాన కొందరు మిత్రులు తమ స్వార్థంకోసం, మామధ్య భేదాభిప్రాయాలను కల్పించారు. కాని, వాటికి నేను చెప్పవలసిన జవాబులేదు....ఒకరకంగా ఆ ఆరోపణలన్నిటికీ మదరాసు తమిళులే సరియైన సమాధానం చెప్పారు. నేను అమెరికానుంచి తిరిగి రావటంతోనే, యిక్కడి వారెంతో ప్రేమతో స్వాగతం చెప్పారు. తమిళులు నాకు యిచ్చిన స్వాగతంచూస్తే, నా మంచితనాన్ని దుర్వినియోగం చేసికొన్న కొందరు తెలుగువారికి ఇంతకంటె సమాధానం ఏం కావాలనిపించింది?

నాకు, మద్రాసుకువుండే సంబంధాన్ని గురించి యింతకన్నా ఏం చెప్పను? నాకు, యీ నగరంమీదవుండే భక్తి శ్రద్ధలవల్లనే బి. ఎన్. రంగాగారిని హైదరాబాదు రప్పించుకోకుండానే, 'వసంతసేన' లో యిక్కడే నటించటానికి అంగీకరించాను. అలాగే భరణీ వారి చిత్రంలో కూడా నటిస్తాను. మీరు చూపే యీ అభిమానానికి నిజంగా కృతజ్ఞుడిని......" ●

[మద్రాసులో ఇటీవల జరిగిన జర్నలిస్టుల సమావేశంలో నటుడు శ్రీ నాగేశ్వరరావు చేసిన ప్రసంగ పాఠ - యిది.]



అవార్డు లందుకొన్న 'అంతస్తులు', 'ఆత్మగౌరవం' చిత్రాల నాయకునికి ఆంధ్రప్రదేశ్ నాయకుని బహుమతి ప్రదానం!

# మన చిత్రాలలో నృత్యాలు

(గత సంచిక తరువాయి)

వంగదేశపు జానపద నృత్యాలలో ఒకటైన "బౌల్" శరత్ హృదయానుగుణ్యంగా తీయబడిన "పరిణీత"లో 'చలే రాధే రాణి'గానూ, "దేవదాసు"లో "ఆన్ మిలో శ్యామ్ సావరే'గానూ ఉన్నది. నిజానికి యిదొక నృత్యంకాదు. భగవత్సంబంధమైన ఒక కథాఘట్టాన్ని పాట మూలకంగా వర్ణిస్తూ, ఏక తార చేతితో మీటుతూ, (సాధారణంగా) యాచకులు వీధుల వెంబడి తిరుగుతూ ఆడే ఆట యిది. పైవాటి గురించి తెలిసి ఆధారపడినదో తెలియకే అనుసరించినదో తెలియదుకాని తెలుగుచిత్రం "అర్థాంగి"లో "రాధను రమ్మన్నాడు'పాటలో యీబౌల్ సూచీప్రాయంగాధ్వనించింది.

శిరాగ్రప్రదేశానికే పరిమితమైన జానపద నృత్యం 'టిప్పీ! ఇళ్లముందు నేలను గట్టిగా గచ్చులా చేసికొనేందుకుగాను చేతిలో దిమ్మిస కర్రలు పట్టుకొని లయానుగుణ్యంగా స్త్రీలు 'దిమ్మి' చేస్తూ ఆడే నృత్యమిది. ఒకే ఒక మారు "గూంజ్ ఉఠీ శహనాయ్"చిత్రంలో కనబడినది.

ఇక మణిపురి నృత్యం. ఆ దుస్తులు, ఆభరణాలు నేత్రపర్వంగా ఉన్నందువలన తెలుగు తమిళ చిత్రాలలో అవిమాత్రం ప్రదర్శింపబడ్డవి కాని శాస్త్రీయమైన ఆ నాట్యం కాదు. రాధాకృష్ణ భావానికే, ప్రేయసీ—ప్రియభావానికే యీ మార్గంలో ప్రస్తార శిలభ్యం ఉండుటచేత ఎక్కువ ఉపయోగకారి కాదనే చెప్పవచ్చును. శాంతారావ్ "పర్ఛాయిన్"లో 'నైనా లగా కే దుఖ్ దేగయో' అని మధురా శాంతారావ్ చేసిన నృత్యమూ, "హమ్ హిందుస్తానీ"లో ఆశా పరేఖ్ చేసిన రెండు నృత్యాలూ మణిపురి నాట్యానికి సినీ గీటురాళ్లు.

పువ్వుల తోరణాలతో అలంకరింపబడిన కుండలను తలపై దొంతిగా అమర్చిచేసేది. కేరళదేశపు ఘట నృత్యం. "ఇన్సానియత్" చిత్రంలో దిలీప్‌కుమార్, ఆగా చేయుగా చూస్తాము. తమిళదేశపు గుర్రం నృత్యం కొన్ని తమిళ చిత్రాలలో చూపబడ్డది. గుర్రం నృత్యమంటే "ఎత్తుకుపై ఎత్తు", "గురువును మించిన శిష్యుడు" చిత్రాలలో ఉన్నటువంటిదికాదు. "చంద్రలేఖ"లో "నాటియ కుదిరే"వంటిదికాదు. మనిషికే గుర్రంవంటి తొడుగు వేయగా, చూడటానికి అశ్వారూఢుడైన రవుతులాగ వుంటూ చేసే నాట్యమిది.

ఇక మిగిలిన ఒకే ఒక భాగం యే కోవకు చెందని, యే శాస్త్రానికీ పూర్తిగా లోబడని నృత్యాలు. పైవిధంగా వ్యవహరించటంలో కొంత యీసడింపు ధ్వనిస్తే అది ఉద్దేశించినదికాదు. ఆ తరగతికి చెందిననాట్యాలకు అంతకుమించినపేరులేదు. సినిమా డాన్స్అనే భ్రష్టపదప్రయోగం తప్ప.

ఈ చిత్ర నృత్యాలలో కూడ 'భలీ' అనిపించేవి లేకపోలేదు. హిందీ "దేవతా" లో కమల నాగకన్యగా వాద్యగోష్టికిమాత్రంచేసిన లాస్యం నాట్యకళకే నీరాజనం. ఇందులో కొంత కథక్, కొంత భరతమూ మిళితమై వున్నాయి. ఈ నాట్యం యింత రాణింపుకు రావటానికి కొంత కారణం సంగీతకారుని (సి. రామచంద్ర) ప్రతిభ. నాలుగు వారాలైనా వచ్చుగా పడవని "కూతురు కాపురం" చిత్రంలో రాజసులోచన చేసిన 'వన్నెల చిన్నెల కన్యసురా' నృత్యం ఫక్తు సినిమార్కు నృత్యమైనా ఆటువంటి వాటిలో అందానికీ అలరింపుకీ దీనిని మించినవి చాలా అరుదు. కొంత జానపద సరళిలో (కొంతమాత్రమే) వున్నవి యెన్నదగ్గవి "రోజులుమారాయి"లో వహీదా రెహమాన్ చేసిన 'ఏరువాకా సాగాలోయ్", "రాజనందిని" లో 'సిక్కెవుతారా సక్కని రాజా' అంటూ అంజలీదేవి, ఆర్. నాగేశ్వరరావు చేసినదీ, మార్వప్రభ "స్త్రీ సాహసం"లో 'జాణతనమునను నా నౌనమునను' అంటూ ఆడినదీ మొదలైనవి. ఈ విభాగానికిచెంది, యీ అంతస్తుకి దరిదాపుల్లో ఉండేవి యెన్నో నాట్యాలు ఉండవు తెలుగు చిత్రాల్లో.

మొదట్లో సినిమా డాన్సులు చూసి ఛాందసులు 'ఆం! దొమ్మరాట' అనేవారు అదే దొమ్మరాటకు కొంత లాటిన్ అమెరికన్ సంగీతమూ, విన్యాసమూ జోడించి బ్రహ్మాండంగా చేసింది వసుంధర తమిళ "మంగమ్మ శపథం"లో. తరువాత "మంగళ"లో అదే నృత్యాన్ని అంత మోటుగాను చేయటానికి భానుమతి ప్రయత్నించిందికాని పూర్తిగా కృతకృత్యురాలు కాలేకపోయింది. అవునుమరి. ఎంతటి లావణ్య పరిమళాదులువున్నా, మల్లెపూవు మొగలిరేకనే భ్రమను కలిగించలేదు. మొన్నటి "మంగమ్మ శపథం"లో అవే నృత్యాలు భయంకరంగా ఉన్నవి. తప్పు పాత్రధారిణి దెంతమాత్రమూకాదు. నృత్యదర్శకులదీ, వికారశయ్యను పయనించిన సంగీతానిదీ. పాశ్చాత్య నృత్య సాంప్రదాయానికి కనీసం కనుచూపుదూరంలోనైనా సాగినవి తెలుగు చిత్రాలలో మరేవీ లేవనే అనవచ్చును. సాధారణంగా క్లబ్బు డాన్సుల పేరిట మన నెత్తిన రుద్దబడుతున్నవి, క్లబ్బు డాన్సులంటే యేమిటో తెలియనివారు అవేమిటో చూచినా తెలుసుకోలేనివారిని మెప్పించడానికి ప్రయత్నిస్తూ విఫలులౌతున్నక్లబ్బు డాన్సులు; కాని పాశ్చాత్య నృత్యాలుకావు.

ఇన్ని రకాల నృత్యాలకు సినిమాలలో ఉత్తమోదాహరణలు తెలుసుకొన్న తరువాత అవి ఎందువలన, యే కారణాలచేత ఉత్కృష్టమైనవో, తక్కినవి యెందుకు కాలేదో కూడ తెలుసుకోనదగిన విషయమే.

ఏ నృత్యమైనా ఉత్తమమైనదిగా ఎన్నిక చెందాలంటే ముఖ్యంగా మూడు విభాగాలలో ఉత్తమంగా ఉండాలి. అవి సంగీతం, సాహిత్యం, నృత్య దర్శకత్వం. చక్కని ఉదాహరణలని పైన చెప్పిన వాటన్నిటికీ పై విభాగాలలో నూటికి ఎనభైశాతం పైనే మార్కులు వేయవచ్చును. ఈ మూడూ ఉదాత్తంగా ఉన్నమీదట తోడ్పడేవి చక్కని ఛాయాగ్రహణం, కూర్పు, (ఎడిటింగ్,) నేర్పుగల నర్తకులు, వీటన్నిటికీ శాస్త్రీయ నృత్యాలలో ఉన్నంత ప్రాముఖ్యత కానివాటిలో ఉండదనేది పరమసత్యం.

మొదటి మూడు బాగా వుంటే తరువాత మూడు దాన్ని చెరచలేవు. యేదో అరుదైన విపరీత పరిస్థితిలోతప్ప. కాని మొదటి మూటిలోనే లోపాలుంటే తరువాతిమూడు యెంతటి ఎత్తునున్నా లాభంలేదు. ఈ విషయాన్ని వర్ణిస్తూపోయేకంటే ఉదాహరణలు చూపించి విశదీకరిస్తేనే చదువరులకు సులభంగా బోధపడుతుంది. (సశేషం)

—వి. ఎ. కె. రంగారావు



'ఎవరాస్త్రీ'లో సరోజాదేవి!

# సినిమా వార్తలు

## స్వప్నలోకంలో సౌదామిని నలకూబరులు

మహాలక్ష్మి మూవీస్‌వారి భీమాంజనేయ యుద్ధం చిత్రానికి మరో రెండు పాటలు చిత్రీకరించారు. ఫిలిం సెంటర్‌లో ఒక ఫ్లోర్‌లో రెండు ప్రక్కల రెండు సెట్సు చక్కగా రంభ అభిమానస్థలము (ఉద్యానవనమే అవాలి) ఒక ప్రక్క, మరోవైపు సౌదామిని, నలకూబరుల స్వప్నలోకం సెట్సు వేయబడింది. ఒకేఫ్లోర్‌లో రెండు సెట్సు వేసినా రెండూ కనుల పండుగగా ఉన్నాయి.

మొదటి సెట్టులో 'కలలన్నీ ఫలియించె యీనాడె......' అనే పాటను కాంతారావు, రాజశ్రీతో చిత్రీకరించారు. ఈ పాటను సి నారాయణరెడ్డి వ్రాశారు. శ్రీమతి పి. సుశీల పాడగా రికార్డింగ్ చేయబడింది.

ఈ సెట్టులో యింకా విజయశ్రీ, చలం కూడ పాల్గొన్నారు.

రెండవ సెట్టులో కూడా సి. నారాయణరెడ్డి వ్రాసిన పాటను కాంతారావు, రాజశ్రీ, విజయశ్రీతో చిత్రీకరించారు. 'సురభామిని సౌదామిని......' అను పాటను ఘంటశాల పాడగా రికార్డింగ్ చేయబడింది.

ఈ చిత్రంలో తొమ్మిది పాటలు, 14 పద్యాలు ఉన్నాయి. ఈ చిత్రాన్ని ఏప్రి



'భక్తపోతన'లో బాలయ్య.

యల్‌లో విడుదల చేయదలచినట్లు నిర్వాహకులు శ్రీ దోనెపూడి కృష్ణమూర్తి తెలియజేశారు సంగీతం—టి. వి. రాజు సమకూరుస్తున్నారు. నిర్మాత—టి. రామకోటేశ్వరరావు, దర్శకుడు—ఎస్. డి. లాల్.

## శోభన్‌బాబు - గీతాంజలి యుగళగీతం

ప్రసాద్ స్టూడియోలోని ఫ్లోర్‌లో, స్వప్న బృందావనానికి పోలిన సెట్టు చక్కగా వేసి ఉంది. చెట్లవరుస, విద్యుద్దీపాలంకరణ, ఫౌంటెన్సు, అక్కడ విహరించే పావురాలు, మయూరాలతో అతి చక్కగా వేయబడిఉంది. ఈ సెట్టులో శోభన్‌బాబు, గీతాంజలి యుగళగీతాన్ని రేఖా అండ్ మురళీ ఆర్ట్సు వంస్థవారు నిర్మిస్తున్న చిత్రం 'పొట్టి ప్లీడర్'కు చిత్రీకరిస్తున్నారు.

ఈ నెలాఖరుతో యీ చిత్రం పూర్తి అవుతుంది. ఏప్రిల్‌లో యీ చిత్రం విడుదల అవుతుంది. హాస్యనటుడు పద్మనాభం ఈ చిత్రాన్ని సమర్పిస్తారు. నిర్మాత శ్రీ పురుషోత్తం. దర్శకుడు: కె. హేమాంబరధరరావు.

## కాంతారావుకు 100 చిత్రాలుపూర్తి స్వగ్రామంలో బ్రహ్మరథం

ప్రముఖ తెలుగు నటుడు కాంతారావు కథానాయకుడుగా త్వరలోనే 100 చిత్రాలు పూర్తి చేస్తున్నారు. ఈ సమయంలో శ్రీ కాంతారావుకు స్వగ్రామంలో బ్రహ్మాండంగా బ్రహ్మరథంపట్టి సన్మానం చేయడానికి ఆ గ్రామస్థులు నిర్ణయించుకున్నారు. 50 జతల ఎడ్లనుకట్టి, చక్కగా అలంకరించిన బండిపై శ్రీ కాంతారావును పుర వీధులలో పూరేగించటం, తర్వాత సన్మానించటం జరుగుతుంది. ఆ వేదికచుట్టూ ఆరుబయలు థియేటరు తర్వాత నిర్మించటానికి ఆ గ్రామస్థుల నిర్ణయం అని తెలుస్తుంది. ఈ సన్మాన సంఘానికి ఒక కమిటీని నియమించుకున్నారు. ఈ సభలో కేంద్ర, రాష్ట్ర మంత్రులు, కొంతమంది ఎం. ఎల్. ఏ. లు నాటక, సినిమా కళాకారులు పాల్గొంటారు

# సినిమా వార్తలు

## మూడు సెట్లులో 'సంగీత లక్ష్మి'

సీతారామాంజనేయ పిక్చర్సువారు తాము తొలిసారిగా నిర్మిస్తున్న 'సంగీతలక్ష్మి' చిత్రానికి వాహినిలో ఒకటి, శారదాలో రెండు సెట్లు వేశారు. వరుసగా మూడు సెట్లలోనూ విస్తారంగా షూటింగ్ చేస్తున్నారు.

రామారావు, జమున, ఎల్. విజయలక్ష్మి రమణారెడ్డి, నాగభూషణం, కె. ఎస్. రెడ్డి మొదలగువారు యీ షెడ్యూల్‌లో ఉన్నారు.

ఈ చిత్రానికి దర్శకత్వం శ్రీ గిడుతూరి సూర్యం వహిస్తున్నారు.

## రాజలక్ష్మి వారి సాంఘికం

రాజలక్ష్మివారు వాహినీ స్టూడియోలో యీమధ్య వారంరోజులు షూటింగ్ జరిపారు. ఇంతవరకు నాలుగు సెట్లులో షూటింగ్ పూర్తిచేశారు. ఈ చిత్రానికి సంభాషణలు, పాటలు ఆరుద్ర వ్రాశారు ఒక పాట సి. నారాయణరెడ్డి వ్రాశారు. పిటిలో ఒకపాటను జయలలిత, కృష్ణతో ఔట్‌డోర్‌లో చిత్రీకరించారు. మరొకటి కృష్ణ, గీతాంజలితో చిత్రీకరించారు.

కృష్ణ, జయలలిత ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు. ముక్కామలక్ష్మి, రాజబాబు, శోభన్‌బాబు గెస్టుగా యింతవరకు పాల్గొన్నారు. అయిదు రీళ్ల చిత్రం యింతవరకు పూర్తి అయింది.

సంగీత దర్శకత్వం : టి. చలపతిరావు

చిత్ర దర్శకత్వం : మల్లికార్జునరావు నిర్వహిస్తున్నారు. నిర్మాతలు : సుందర్‌లల్ నహతా—డూండీ.



"శకుంతల"లో రామారావు, సరోజాదేవి.

## త్వరలోనే 'విజయ శంఖం'

శ్రీ కనకమేడల వెంకటేశ్వరరావు 'విజయ శంఖం' చిత్రం పూర్తి చేస్తున్నారు. ఈ చిత్రానికి రచన—నిర్మాత కూడ శ్రీ వెంకటేశ్వరరావే. ఈ చిత్రంలో బాలయ్య, రాజశ్రీ ముఖ్య భూమికలు పోషిస్తున్నారు. ఇంకా యీ చిత్రంలో రాజనాల, మిక్కిలినేని, రేలంగి, హేమలత మొదలగువారు నటిస్తున్నారు. మరో నాల్గైదు రోజుల షూటింగుతో కాల్‌షీట్లు సర్దుబాటు అయితే చిత్రం పూర్తి అవుతుంది. ఈ చిత్రానికి దర్శకుడు : కె. వి. నందనరావు.

## స్పెషియల్ 7న 'పరమానందయ్య శిష్యుల కథ'

శ్రీదేవి ప్రొడక్షన్సువారి 'పరమానందయ్యశిష్యుల కథ' స్పెషియల్ 7 వ తేదీన విడుదల చేస్తున్నారు. మొదట యీ చిత్రం ఉగాది కానుకగా తెలుగు సంవత్సరాదినాడే విడుదల చేయాలనుకున్నారు

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, కె. ఆర్. విజయ, ఎల్. విజయలక్ష్మి, పద్మశ్రీ నాగయ్య, ముక్కామల, ఛాయాదేవి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, రాజబాబు మొదలగువారు నటించారు.

సంగీత దర్శకత్వం : ఘంటసాల, చిత్ర దర్శకత్వం : సి. పుల్లయ్య, నిర్వహించారు. నిర్మాత : తోట సుబ్బారావు.

## డి. వి. ఎస్. ప్రొడక్షన్ పాట రికార్డింగ్

డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ అధినేత శ్రీ డి. వి. ఎస్. రాజు రెండవ చిత్రం కూడా జానపదమే ప్రారంభించారు. సముద్రాల జూనియర్ సంభాషణలు వ్రాశారు. సి. నారాయణరెడ్డి వ్రాసిన ఒక పాటని యీమధ్య సుశీల పాడగా రికార్డింగ్ చేశారు. సంగీత దర్శకత్వం: టి. వి. రాజు, నిర్వహిస్తున్నారు. దర్శకత్వం : బి. విఠలాచార్య.

## చందమామ బేనర్‌లో 'ఏకవీర' చిత్రం

చందమామ ఫిలింస్‌వారు 'ఏకవీర' నవలను చలనచిత్రంగా తీయడానికి ఎన్నుకున్నారు. నవలా రచయిత కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఈ కథకు లత గారు సంభాషణలు వ్రాస్తున్నారు.

ఈ చిత్రంలో కథానాయకుడుగా అక్కినేని నాగేశ్వరరావు నటిస్తారనీ, ఈస్ట్‌మన్ కలర్‌లో, హైదరాబాద్‌లో నిర్మిస్తారని తెలుస్తుంది.

నిర్మాత . డి. ఎల్. నారాయణ.

—ధర్మాజీ

# సామాన్యుని స్వాగతం... అవార్డులు!

తెలుగువారు ఏం చేసినా ఏదో ప్రత్యేకత ఉండాల్సిందే. ప్రత్యేకతలను ఆపాదించుకోవటంలోను, అలా సంపాదించుకొన్న ప్రత్యేకతకు వింతవింత రంగులు తీర్చి దిద్దుకోవటంలోను—ఎవరైనా సరే—మన తర్వాతనే !

ఈ సంగతి గుర్తు వచ్చినప్పుడల్లా పట్టలేనంత సంతోషం వస్తుంది. ఈమధ్యనే రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన 'ఆంధ్ర ప్రదేశ్' ఫిలిం అవార్డుల వార్తలు విన్నాక— "మనవాళ్లు ఘనులే" అనిపించింది.

మనలో చాలామందికి తెలును—ఈ అవార్డులు చాలా విలువైనవి. ప్రజల్లో కొందరికి ఈ "అవార్డుల" విలువ కొంతవరకే పరిమితమేనని తెలిసినా, వీటి పెద్దతనాన్ని గురించి, వీటి గొప్పతనాన్ని గురించి లేని పోని అపోహలు పడి, ఇదంతా నిజమేనని నమ్మేవారు కూడా ఉంటారు.

నా మటుకు నాకు యీ అవార్డుల ఎన్నికల విషయంలో ఎలాంటి "అపోహ" లేదు. ఈమాట యిలా ధైర్యంగా చెప్పటానికి కారణం : అవార్డుల తీరుతెన్నులు ముందుగానే తెలిసి ఉండటం.

* * *

తెలుగులో చెత్తా, చెదారం అంతా కలిపి పోయిన సంవత్సరంలో మొత్తం 50 చిత్రాలు విడుదలయ్యాయి. వీటిల్లో మూడు చిత్రాలు బంగారునంది, వెండినంది, కంచునంది—బహుమతులను అందుకొంటున్నాయి.

* * *

బహుమతులు అందుకొన్నచిత్రాల జాబితా, అందుకోని చిత్రాల జాబితా చూశాక అవార్డు చిత్రాల ముఖ్యులు, కొందరు నటీనటులు మంచి తెలివితేటలున్నవారని తేలిపోయింది. నిజంగా అందరికీ యీ తెలివితేటలుండవు దేనికైనా ఒక ఆలోచన ఉండాలి. మొదట్నించి ఒక పథకం వేసికొని, దాన్ని ప్రతి క్షణంలోను తూ. చ. తప్పకుండా అమలు జరిపితే, ఓడిపోవటానికి వీల్లేదు. ఇలాంటి ఓటమికి గురిగాక, విజయాన్ని సాధించిన చిత్రాలకు, ఆ చిత్రాలకు సంబంధించిన వ్యక్తులకు ఇవే నా అభినందనలు! ముందు ముందు కూడా వీరందరి చిత్రాలు, మళ్లీ మళ్లీ అవార్డులు సంపాదించుకోటానికి అన్ని సదుపాయాలు సమకూరాలని నా హృదయపూర్వకమైన ఆశాభావం !

* * *

అవార్డులను గురించి, పాపం, ఏవేవో 'అపోహలు' పెట్టుకొని, ధీమాగా యింట్లో కూర్చొని దగాపడిన తమ్ముళ్లూ ఉన్నారు, మన తెలుగు చిత్రసీమలో.

ఉదాహరణకు : ఒక దర్శకులున్నారు. ఆయన వయస్సులో చిన్నవాడు. కష్టపడి, అసలైన సిసలైన తెలుగువారి కథను



భారీ ప్రయత్నాలతో వెండితెరకు ఎక్కించారు. ప్రతి నిముషమూ ఆ చిత్రాన్ని ఒక కళాఖండం చేయాలనే ఆశతో, మనస్సును పాడు చేసుకొన్నారు. అదేదో పల్నాడట, అమరావతిట—అక్కడంతా తిరిగి, ఆనాటి వాతావరణాన్ని పరిశీలించారు. అంతటితో ఆగక అప్పటి చరిత్రకు సంబంధించిన పుస్తకాలు చదివారు. రెండు సంవత్సరాల పాటు ప్రతి నిముషం కష్టపడి సినిమా తీశారట. పాపం ఆయనకి తెలియదు కాబోలు—మౌనంగా యింట్లో కూర్చుంటే ప్రైజులు, అవార్డులు రావని !

అలాగే మరొకాయన !.... తెలుగులో మొదటిసారి ఓ డజను మంది కొత్తవారిని వెండి తెరకు పరిచయం చేశారు. దేశంలోనూ, ప్రపంచంలోను ఇంతవరకు ఎక్కడా లేని, ఎక్కడా వినిపించని ప్రయత్నంచేస్తే కనీసపు ప్రభుత్వాదరణ లభించకపోతుందా అని ఆశించాడు. ఎందుకీ ఆశలు? ఆమాటకొస్తే, యీ "కొత్తవాళ్ల"కు హైదరాబాదులో ఎవరు తెలుసు గనుక ? అథవా, సింహగర్జనలయినా చేతకావు, వీళ్లకు !

అలాగే, మరి కొందరు నిర్మాతలు, దర్శకులు ధీమాగానే మద్రాసులోనే ఉండిపోయారు. వీళ్లకసలేమీ తెలియదు. అదను చూచుకొని, ఎప్పుడు హైదరాబాదు వెళ్లాలో, ఎక్కడి పనులు అక్కడ ఎలా ముగించుకోవాలో వీరికి తెలియదు. గత సంవత్సరం తయారయిన 50 చిత్రాలలో విజయవంతమయిన మూడుచిత్రాలతో బాటు, కనీసం మరో ముప్పై చిత్రాలకు (డబ్బింగ్‌లతో కలిపి) మరికొన్ని నందులను, నందులు లేకపోతే, శివ పార్వతి విగ్రహాలను, అమ్మవారి పటాలను యిచ్చి ఎట్లయితే బావుండేదేమో ! మిగతా వాటికి ఈఅవార్డులు అక్కర్లేదు కారణం : న్యాయమైన న్యాయ నిర్ణేతలయిన ప్రజల ఆదరాభిమానాలు వీటికి ఎప్పుడూ ఉంటాయి ?

దగాపడిన తమ్ముళ్లకు సానుభూతి.

—సామాన్యుడు (హైదరాబాదు)

# అశోకా శాండల్ వుడ్

## ఫేస్ - టాల్కం - ఆల్ పర్పస్ పౌడర్లు




ఉత్తమమైన మైసూరు చందనముతో తయారైనవి. వీటిని వుపయోగించిన దినమంతయు దేహమును చల్లగా నుంచి వేసవి తాపం తెలియనివ్వదు ముఖ్యంగా మొటిమలు, చెమటగుల్లలు వగైరా చర్మవ్యాధులను ఉపశమింపచేయును




విజయా కెమికల్స్

మద్రాసు-7

---




# కండ్ల అందానికి రక్షణకు

# దర్ బార్ కాజల్

కాటుక (రిజిష్టర్డు)

తయారుచేయువారు :-

రాంబీర్ కంపెని, బొంబాయి-4.

---

పరిమళ

# బ్రాహ్మీ హేర్ ఆయిల్



సున్నితముగా పరిమళం చేయబడిన ఈ ఆయుర్వేద హేర్ ఆయిల్ మెదడును చల్లపరచి, ఉపశమన కలిగించును. క్రమమైన బ్రాహ్మీ హేర్ ఆయిల్ వాడకం మెదడుకు కలుగు అలసటను తొలగించి, హాయిగా నిద్రపట్టించును. ఆరోగ్యమైన కురులు పెరుగుటకు తోడ్పడును.





# బెంగాల్ కెమికల్

కలకత్తా
బొంబాయి
కాన్పూరు

---

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రముఖంగా ఇండియన్ ఇంక్ తో వేసిన కారునులు వ్యాసి మేపంపాలి. సాధారణంగా 4" X 2", 4" X 4" చిత్రాలు ప్రతి కలో పడుతూ ఉంటాయి సం॥

---

మంచి ట్రాన్సిస్టర్ కావాలా ?

# మూర్తి & కో.,

లో చూడండి! ఫోన్ 369

బీసెంటురోడ్డు * విజయవాడ-2

బ్రాంచి హైదరాబాద్

అందగా జపాన్ సాంకేతిక సహాయంతో తయారైన

# షార్ప్-ఝుంకార్

కొంటున్నారు మీరూ కొనండి.

---

## చిత్రకళ నేర్చుకొనండి !

చిత్రలేఖనం అభ్యసించవలెనని కుతూహలము స్త్రీలకు మరియు పురుషులకు చక్కని అవకాశము రెండు సంవత్సరాల్లో, లేక ఒక సంవత్సరములో, ఇంటివద్దనే ఉండి 'పోస్టల్ ట్యూషన్' ద్వారా 'డాయింగ్' నేర్చుకొనవచ్చును. బోధనా భాష తెలుగు 'ప్రాస్పెక్టస్'కై 25 పైసల స్టాంపులను దరఖాస్తుతోపాటు పంపించండి

**గాయత్రీ చిత్ర విద్యాలయము**

మల్లాయపల్లి, చెల్లాపూర్ పోస్టు,
సిద్దిపేట తాలూకా, మెదక్‌జిల్లా (ఆంధ్ర)

---

అద్భుతమైన

హోం సినిమా పొజకరు




మీ అభిమాన తారలు, శృంగార, హాస్య, అద్భుత, సాహస సన్నివేశాలలోను, వార్తలను, కార్టూనలను, పండిట్ నెహ్రూ కథను, మీ గృహములోనే తెరమీద నాట్యంచేయుటను మీరు చూడగలరు. డీలక్స్ స్పెషల్ తగ్గింపబడిన ధర 25/- 60 అడుగుల ఫిలిం 4' X 3' స్క్రీన్ పుస్తకం. పోస్టేజి రు. 5/- వేలాది ప్రొజెక్టర్లు అమ్మబడినవి ఇవి యెక్కువగా కోరబడుచున్నవి వేడే మీ ఆర్డరు పంపండి

**HOLLYWOOD CINEMA CORP (Regd)**

**Kalyanpura, Delhi—6**

Pratap/HCG-66


Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press, 6&7Thambu chetty Street, Madras-1. Phones . Editorial, 21747, Other depts 29766. Chief Editor: S. Sambhu Prasad.

